# కమ్యూనిస్టు నీతి

(మార్క్స్, ఏంగెల్స్, లెనిన్)

సంకలనం:

**కంభంపాటి సత్యనారాయణ**




**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**COMMUNIST NEETHI**
***Compiled by Kambhampati Satyanarayana***

ప్రచురణ సంఖ్య : 2350/938 R

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1980

ద్వితీయ ముద్రణ : జూన్, 2004



టైటిల్ డిజైన్ : **రాజా**

**వెల: రూ.25/-**

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, నారాయణగూడ, హైదరాబాద్.

# విషయసూచిక

***

# ముందుమాట*

మానవ సమాజంలో యింతవరకు దోపిడీ వర్గాలు అనుసరిస్తూ వచ్చిన నీతి స్వార్థపరత్వం, కాపట్యం, వంచన, క్రౌర్యం వగైరా. వీటిని కార్మికవర్గం తిరస్కరిస్తుంది. దాని నైతిక లక్షణాలు మానవత, సమిష్టితత్వం, అన్యోన్య సహాయం వగైరా. కమ్యూనిస్టు నీతి అంటే యిదే. ఇదే సర్వోత్కృష్టమైన నీతి. ఎందుచేతంటే, యిది మొత్తం శ్రామిక ప్రజల ఆశలకు, ఆశయాలకు అనుగుణమైనది.

దోపిడీ వర్గాల ఆధిపత్యంలో వక్రీకరింపబడి కాలరాయబడుతున్న ప్రాథమిక, నైతిక విలువల్ని కమ్యూనిజం పునరుద్ధరించి, అభివృద్ధి చేస్తుంది. వాటిని అనుల్లంఘనీయమైన శాసనాలుగా రూపొందిస్తుంది. మానవజాతి వేల సంవత్సరాలలో దౌర్జన్యానికీ, దోపిడీకీ వ్యతిరేకంగా న్యాయం కోసం, ధర్మం కోసం పోరాడి నిలబెట్టుకున్న నైతిక ప్రమాణాలను కమ్యూనిజం తనలో యిముడ్చుకొంటుంది.

సమాజం సర్వతో ముఖంగా అభివృద్ధి చెందడంలో కార్మిక వర్గ నీతి అంతకంతకెక్కువ ప్రాముఖ్యత వహిస్తుంది. సమసమాజ స్థాపనకై జరిగే పోరాటం ఉధృతమయే కొద్దీ అది సరికొత్త లక్షణాలను సంతరించుకొంటుంది. అట్టి సమాజం స్థాపించబడ్డ తర్వాత అది యావత్ప్రపంచానికీ తన కాంతి కిరణాల్ని ప్రసరింపజేస్తుంది.

ఎంగెల్స్ యిలా తెలియజేశారు:

"గతంలో సమాజం వర్గవైషమ్యాలద్వారా వృద్ధిచెందినందున, నీతి ఎల్లప్పుడూ వర్గనీతిగానే ఉంటూ వచ్చింది. అది పాలకవర్గ ప్రయోజనాల్నీ, పెత్తనాన్నీ సమర్థించడమైనా చేసింది; లేదా పీడిత వర్గం తగినంత శక్తిని పుంజుకున్నప్పటినుంచీ ఆ పెత్తనంపట్ల పీడిత వర్గ

---

* 1980 సం॥లోని ప్రథమ ముద్రణా ప్రతి నుండి కొన్నిటిని ఎంపిక చేసి, పాఠకుల అవగాహన కోసం శీర్షికలుంచి ఈ సంపుటిని రూపొందించాం.

– ఏటుకూరి ప్రసాద్

ఆగ్రహాన్నీ, ఆ వర్గ భవిష్యత్ప్రయోజనాల్నీ ప్రకటించడమైనా చేసింది. ఈ క్రమంలో, మొత్తం మీద, మిగతా జ్ఞాన రంగాలన్నిటిలాగే నీతికూడా అభివృద్ధి చెందిందనడంలో సందేహంలేదు! కాని, మనమింకా వర్గ నీతిని అధిగమించలేదు. సమాజం ఏ దశలో వర్గ వైషమ్యాలను అధిగమిస్తుందో, దానితోబాటు ఏ దశలో వాటిని నిత్యజీవితంలో మరచిపోతుందో, ఆ దశలో మాత్రమే నిజమైన మానవ నీతి, వర్గ వైషమ్యాల కతీతమైనట్టిది, వాటి జ్ఞాపకాల కతీతమైనట్టిది, సాధ్యపడుతుంది."

అంటే, నిజమైన మానవ నీతి కమ్యూనిస్టు సమాజంలోనే వికసిస్తుందన్నమాట!

దీనితోబాటు, ఎంగెల్స్, ఆధునిక సమాజంలో భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలకు చెందిన నీతి సూత్రాలు ఏక కాలంలోనే ఒకదాని సరసన ఒకటి వ్యాప్తిలో ఉన్నాయనీ, అందుచేత అవి పరిపూర్ణమైనవి కావనీ స్పష్టం చేశారు. కాని, వాటిలో సమానాంశ చాలా ఉన్నదంటారు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే: "పైన పేర్కొన్న మూడు విధాలైన నైతిక సిద్ధాంతాల్లో (ఫ్యూడల్, బూర్జువా, శ్రామిక) సమానాంశ చాలా ఉంది. అది, సర్వకాల సర్వావస్థల్లోను స్థిరంగా నిలిచే నీతిలో కనీసం ఒక భాగమే కాదా? ఈ నైతిక సిద్ధాంతాలు ఒకే చారిత్రకాభివృద్ధి యొక్క మూడు దశలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అందుచేత, వాటి చారిత్రక పూర్వరంగం సమానమైనట్టిది. అందుచేతనే, వాటిలో సమానాంశ చాలా ఉంది. అంతేకాదు, ఆర్థికాభివృద్ధి యొక్క సరిపోల్చదగ్గ దశల్లో నైతిక సిద్ధాంతాలు తప్పనిసరిగా ఏకత్వాన్ని కలిగియుంటాయి."

కుటుంబ జీవనం, స్త్రీ పురుష సంబంధాలు, తోటివారిపట్ల ప్రవర్తన, న్యాయాన్యాయాలు మొదలైనవి పెట్టుబడిదారీ సమాజంలో ఎంత వికృతంగా, ఎంత కుటిలంగా ఉన్నాయో, అవే సోషలిస్టు సమాజంలో ఎంత ఉన్నత శిఖరాలకు చేరుకుంటాయో మార్క్స్-ఎంగెల్స్‌లు తమ రచనల్లో తెలియజేశారు.

దీనితోబాటు, మార్క్స్-ఎంగెల్స్‌లు తరతరాలుగా మానవజాతి సంతరించుకొన్న నైతిక ప్రమాణాలను ప్రతిభావంతంగా వివరించారు.

వారి రచనల్లోని ముఖ్యభాగాలను పాఠకుల దృష్టికి తేవడమే యీ సంకలనం యొక్క ఉద్దేశ్యం.

మార్క్స్ తన యౌవనంలోనే జీవిత పరమార్థాన్ని ఒక గేయంలో యిలా తెలియజేశారు.

"లక్ష్యరహిత గమ్యరహితమైన బతుకు వద్దు మనకు
నిస్సారపు నిర్జీవపు కాకి బతుకు వద్దు మనకు
పద పద పద పోదాం పద దూరంగా వేగంగా
కష్టాలను క్లేశాలను లెక్కించక పోదాం పద."

ఒక సందర్భంలో, మార్క్స్ తన కతిప్రియమైన సద్గుణం నిరాడంబరత అనీ, తన ప్రధాన లక్షణం ఏకాగ్రత అనీ, సౌఖ్యమనగా తన భావం పోరాడ్డమనీ తెలియజేశారు. అన్నిటికంటే తాను ఎక్కువగా అసహ్యించుకొనే దుర్గుణం దాసత్వం అన్నారు.

మరొక సందర్భంలో ఆయనిలా రాశారు:

"మానవజాతికి అత్యధికంగా మేలుచేయగల వృత్తిని మనం ఎంచుకున్నట్లయితే, మనం దేనికీ తలవంచ నవసరంలేదు. ఎందుచేతంటే, అది అందరికోసం చేసే త్యాగం. అప్పుడు మనం పొందే ఆనందం అల్పమైనదికాదు. ఎందుచేతంటే, లక్షలాది ప్రజల సౌఖ్యమే మన సౌఖ్యం అవుతుంది. మన కార్యాలు ప్రపంచంలో శాశ్వతంగా నిలిచిపోతాయి; మన అస్తికలు మహానుభావుల అశ్రుధారలతో పునీతమవుతాయి "

మార్క్స్ ఎల్లప్పుడూ సొంత ప్రయోజనాలకన్న పార్టీ ప్రయోజనాలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. ఒక మిత్రుని కాయన రాసిన లేఖలో యిలా తెలియజేశారు: "పార్టీ ప్రయోజనాలకే నేను ప్రాధాన్యత నిస్తూండడంవల్ల సొంతప్రయోజనాలెల్లప్పుడూ దెబ్బతింటున్నాయి. దానికి కూడా నేను అలవాటుపడ్డాను. పైగా సొంత ప్రయోజనాల్ని పరిగణనలోకి తీసుకొనే అలవాటే నాకు లేదు."

దాంపత్య ప్రేమకు మార్క్స్ దంపతులు పెట్టిందిపేరు. ఒక లేఖలో మార్క్స్ తన భార్యకిలా రాశారు: "నీవు నాకు ఏ క్షణంలో దూరమవుతావో, ఆ క్షణంలో నీపట్ల నా ప్రేమ బృహద్దర్శనమిస్తుంది; ఒక మహాకాయునిలా నా ముందు నిలుస్తుంది; దానిలో యావదాత్మ బలం, యావద్భావనా శక్తి కేంద్రీకృతమవుతాయి. అప్పుడు నేను మళ్ళీ మానవుణ్ణి అవుతాను - సమగ్రమైన అర్థంలో."

ప్రపంచ కార్మికుల విముక్తికోసం మార్క్సు అనుభవించని కష్టాలు లేవు; భరించని బాధలు లేవు. లండన్‌లో నివసిస్తున్నప్పుడు మార్క్సు కుటుంబం అనుభవించిన దారిద్ర్యాన్ని వర్ణిస్తూ ఆయన భార్య ఒక మిత్రునికి రాసిన జాబు చదువుతుంటే, కంట తడిపెట్టకుండా ఉండలేం. అయినా, ఆయన మేరుపర్వతంలా నిలబడి, జీవితాంతం ప్రపంచ విప్లవం కొరకు పోరాడేరు. ఆయన జీవితమే కమ్యూనిస్టు నీతికి ఒక దర్పణం.

ఎంగెల్స్ విషయం కూడా యింతే.

ఒక ప్రసంగంలో ఎంగెల్స్ యిలా అన్నారు: "నేను వారి (సంపన్నుల) సాంగత్యాన్నీ, విందు భోజనాల్నీ విసర్జించాను. మధ్యతరగతులు సేవించే పోర్టువైన్‌నీ, షాంపేన్‌నీ కాలదన్నేను. నా తీరిక సమయాన్ని యించుమించు పూర్తిగా సామాన్య కార్మికులతో సాంగత్యానికి వినియోగించాను. అలా చేసినందుకు నేను సంతోషపడ్డాను; గర్వపడ్డాను. సంతోషించడమెందుకంటే, ఆ విధంగా నేను జీవిత వాస్తవాలను తెలుసుకోడానికి అనేక గంటలు ఆనందంతో గడపగలిగాను. లేకపోతే, ఆ సమయమంతా ఫ్యాషన్లకు సంబంధించిన సంభాషణల్లోను, నిరర్థక మర్యాదల్లోను వ్యర్థమైపోయేది. గర్వించడమెందుకంటే, ఆ విధంగా నేను పీడితవర్గానికి, దూషిత వర్గానికి న్యాయం చేకూర్చేందుకు అవకాశం కలిగింది..."

కమ్యూనిస్టు సమాజంలో మానవత్వ మెలా తొణికిసలాడుతుందో వివరిస్తూ, ఎంగెల్స్ యిలా రాశారు: "మానవుని సొంత ప్రయోజనమూ, మానవజాతి సమిష్టి ప్రయోజనమూ ఒకటయేటట్లు చూడాలి." ఎంగెల్స్ జీవితమే ఈ సూత్రానికి నిదర్శనం.

మార్క్సు, ఎంగెల్స్ లిద్దరూ వర్గసమాజంలోని నీతి బాహ్యతను దుయ్యబట్టడమేకాక, కమ్యూనిస్టు నీతిని ప్రవచించడమేకాక, తమ నిత్యజీవితంలో దానిని ఆచరించి చూపేరు.

ఇది ఈ సంకలనంలో స్పష్టం చేయబడింది.

బోల్షివిక్ పార్టీ స్థాపకుడు, అక్టోబరు విప్లవ అధినేత, ప్రథమ సోషలిస్టు రిపబ్లిక్ ప్రధాని అయిన లెనిన్ కూడా మార్క్సు, ఎంగెల్స్‌ల అడుగుజాడల్లోనే నడిచారు.

యువ కమ్యూనిస్టు సమితి మూడవ మహాసభలో ఉపన్యసిస్తూ లెనిన్, కమ్యూనిస్టు నీతి ఎలా ఉంటుందో తెలియజేశారు. ఫ్యూడల్ నీతి, బూర్జువా నీతి పచ్చి బూటకపు నీతులనీ, అవి కార్మికుల్నీ, రైతుల్నీ వంచించే స్వభావం గలవనీ చెప్పి, కమ్యూనిస్టు నీతి కార్మికులు జరిపే వర్గపోరాటం నుంచి ఉత్పన్నమవుతుందన్నారు. దాని లక్ష్యం, సమాజాన్ని మరింత ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్ళడమన్నారు.

లెనిన్ చాల సంవత్సరాలు విదేశాల్లో ప్రవాస జీవితం గడపవలసి వచ్చింది. తరచు ఆయన కార్మిక సభలకు వెళ్తూ ఉండేవారు. వారి జీవితాలను పరిశీలించేవారు; వారితో సంభాషణలు జరిపేవారు. తాను, తన భార్య చౌక గదుల్లో నివసిస్తూ, చౌక భోజనం చేసేవారు. అందుకు భిన్నమైన జీవితం వారికి చేతగాదు. ప్రధానిగా ఉన్నప్పుడు సైతం లెనిన్ 500 రూబుళ్ళ జీతంతో గడిపేవారు. మామూలు ఆహారంతో రోజుకు పదిహేను, పదహారు గంటలు ఏకబిగిని పనిచేస్తూండడం చూచి, ఒకసారి ఆయన కార్యదర్శి మరో 300 రూబుళ్ళు కలిపి బల్లమీద పెట్టాడట. లెనిన్ వాటిని లెక్కపెట్టుకొని, కార్యదర్శిని కఠినంగా మందలించి, అదనపు సొమ్మును తిరిగి యిచ్చేశారట.

దీనినిబట్టి, లెనిన్‌ని విరాగిగా అర్థంచేసుకోకూడదు. స్కేటింగ్ అన్నా, కొండ లెక్కడమన్నా, సైకిలు తొక్కడమన్నా ఆయనకెంతో యిష్టం. సంగీతమంటే ఆయన చెవికోసుకొనేవారు. జీవిత సౌందర్యం ఆయనను మైమరపించేది. తన కామ్రేడ్స్‌నీ, ప్రజల్నీ ఆయన ప్రేమించేవారు. ఆయన హాస్యం, వ్యంగ్యం యితరుల్ని ఆకట్టుకొనేవి.

తన కామ్రేడ్స్‌పట్ల లెనిన్ అమిత శ్రద్ధ చూపేవారు. జైల్లో ఉన్నా, బయట ఉన్నా, ప్రవాసంలో ఉన్నా, ప్రధానిగా ఉన్నా తన కామ్రేడ్స్‌ని కనిపెట్టి యుండేవారు. కామ్రేడ్స్‌నే కాదు, ఆపదలో ఉన్న వారందరికీ తోడ్పడేవారు. ప్రజా ఆరోగ్య మంత్రి పదే పదే ఆరోగ్యం కోల్పోతూ, చికిత్స పొందకుండా, ఎన్నిసార్లు మందలించినా వినకుండా, తన విధుల్ని నిర్వర్తిస్తూండడం చూచి, లెనిన్ ఆయనచేత బలవంతంగా సెలవుపెట్టించారు. 78 ఏండ్ల ఒక వృద్ధ పరిశోధకునికి నెల నెలా 2000 రూబుళ్ళ భృతిని శాంక్షను చేశారు. ఒక భూగర్భ శాస్త్రజ్ఞుని భార్య, ఒక ప్రఖ్యాత నర్తకి వారి వారి గదుల్ని బలవంతంగా ఖాళీచేయవలసిన

దుస్థితిని తప్పించారు. చావు బతుకుల మధ్యనున్న ప్రఖ్యాత అరాచకవాది క్రొపోట్కిన్‌కి వైద్యచికిత్స కేర్పాట్లు చేశారు.

ఆపదల్లో నున్నవారి నెంత ఆప్యాయతతో ఆదుకొనేవారో, తన ప్రభుత్వంలోనే ఉన్న నిరంకుశోద్యోగులపట్ల అంత నిర్దాక్షిణ్యంగానూ ఆయన వ్యవహరించేవారు. ఒక కొనుగోలు సంస్థ సభ్యుడు ఆకలిగొన్న 120 మంది కార్మికులకు గోధుమపిండి సప్లయిచేయ నిరాకరించి నందుకు అతనిని అరెస్టు చేయమని ఉత్తరువు జారీచేశారు. ఒక పౌరుణ్ణి విచారణలేకుండా దీర్ఘకాలం జైల్లో నిర్బంధించి యుంచిన అధికారిని కోర్టులో హాజరుపెట్టమని ఆజ్ఞాపించారు. ఒక స్థానిక సోవియట్‌కు జరిగిన ఎన్నికల్లో నాన్‌పార్టీ ఓటర్లను ఓటుచేయకుండా నిరోధించిన కార్యకర్తలను కఠినంగా మందలించారు. లంచం తీసుకున్నట్లు రుజువైన ఒక కేసులో ముద్దాయిలు తాము నేరస్తులమని ఒప్పుకున్నా, వారికి ఆరునెలలు మాత్రమే జైలు శిక్ష విధించిన న్యాయాధిపతిని పార్టీనుంచి వెళ్ళగొట్టమని సిఫార్సు చేశారు. "రాజకీయ బ్లాక్‌మెయిల్" అనే వ్యాసంలో లెనిన్ యిలా రాశారు: "బ్లాక్‌మెయిల్ చేసేవారిని (హడలుకొట్టి, కొల్లగొట్టుకొనేవాళ్ళు) వాతవేసి చూపడంలో మనం దృఢంగా నిలబడాలి. అతి స్వల్పమైన అనుమానాలు పొడసూపినప్పటికీ, వాటిపై తీర్పు యివ్వడంకోసం వర్గచైతన్యంగల కార్మికులముందు, పార్టీముందు మనం నిక్కచ్చిగా నివేదించాలి."

అత్యున్నత పదవుల్లోనున్న ప్రజామంత్రుల్ని సైతం విమర్శించడానికి హక్కు ఉండాలని లెనిన్ ఒక సందర్భంలో తెలియ జేశారు. "నిశితమైన విమర్శను అనుమతించాలా, కూడదా అనేది ఒక సమస్యగా ఉత్పన్నం కారాదు. ఎందుచేతంటే, అలాంటి విమర్శచేస్తూ ఉండడం విప్లవకారుని కర్తవ్యం. ప్రజామంత్రులు, తాము ఏ తప్పులూ చేయనివాళ్ళమని విర్రవీగరు."

రష్యాలో విప్లవం విజయవంతమయాక, స్త్రీ పురుషులమధ్య విశృంఖలత్వాన్ని బోధించే ఒక వక్రధోరణి – స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతం యువజనోద్యమంలో వ్యాప్తి చెందింది. దాని ప్రభావం మహిళా ఉద్యమంలో కూడ కొందరిమీద పడింది. ఈ ధోరణి బూర్జువా లక్షణం తప్ప మరొకటి కాదని లెనిన్ స్పష్టం చేశారు. జర్మన్ కమ్యూనిస్టు పార్టీలో

ప్రముఖురాలైన క్లారా జెట్కిన్‌తో ఆయన ఈ సమస్యను సాకల్యంగా చర్చించారు; తన అభిప్రాయాన్ని నిష్కర్షగా తెలియజేశారు. ఆయన అన్నమాట లివి: "తమ జల్సా జీవితాన్ని రాజకీయాలతో జతపరచే స్త్రీలూ, కనపడ్డ ప్రతి లంగాను వెంబడిస్తూ ప్రతి యువతి గుడ్డపీలికను వాంఛించే పురుషులూ నమ్మదగినవారని నే ననుకోను. వద్దు, వద్దు. విప్లవానికిది ఏ విధంగానూ పొసగదు.... శ్రామికవర్గం పైకి, పైపైకి ఎక్కే వర్గం. దానికి మైమరపించేదేదీ, ఉద్రిక్తపరచేదేదీ అక్కరలేదు. లైంగిక విశృంఖలత్వం ద్వారాగాని, మద్యపానం ద్వారాగాని అది తన్నుతాను ఉద్రిక్తపరచుకోనక్కరలేదు."

ఈ సంకలనంలోని లెనిన్ వ్యాస భాగాలను, లేఖలను, ఉత్తరువులను చదువుతుంటే, పాఠకుల్లో అనేక విషయాలమీద కనువిప్పు కలుగుతుంది.

లెనిన్‌తో కలిసి పనిచేసిన ఝుర్షిన్‌స్కీ లేఖలు జైలు డైరీలు, వ్యాసాలు కూడా కమ్యూనిస్టు నీతిని ప్రస్ఫుటంగా వివరిస్తాయి. ముందు ముందు కమ్యూనిస్టు సమాజంలో పరిపక్వ స్థితి నందుకోనున్న నూతన మానవుణ్ణి ఝుర్షిన్‌స్కీ రచనల్లో మనం దర్శించగలం. ఉదాహరణకు, మనలోని 'అహం' మిగతా ప్రపంచాన్నీ, ప్రజల్నీ తనలో లీనం చేసుకోకపోతే, అది బతకడమే దుర్లభమంటారాయన. వ్యక్తుల దౌర్భాగ్య స్థితికి జాలిపడనివాడు సమాజం యొక్క దౌర్భాగ్యస్థితికి జాలిపడలేదని మరో సందర్భంలో అంటారు. ఇంకొకచోట "నేను సంపదను ద్వేషిస్తాను. ఎందుచేతంటే, ప్రజల్ని ప్రేమించడం నేర్చుకున్నాను గనుక," అంటారు. మానవుడనుభవించగల సౌఖ్యాల్లో అత్యున్నతమైనదానిని ఝుర్షిన్‌స్కీ[1] యిలా నిర్వచించారు: "ఇతరులకు తాను కాంతికిరణమై, తన చుట్టూ కాంతిపుంజాల్ని వెదజల్లడం. అప్పుడు మానవుడు బాధ అన్నా, దౌర్భాగ్యస్థితీ దారిద్ర్యం అన్నా బాధపడడు. అప్పుడే అతడు జీవితాన్ని నిజంగా ప్రేమిస్తాడు."

ఎనిమిది సంవత్సరాలు సుప్రీం సోవియట్‌కు అధ్యక్షులుగావున్న కాలినిన్[2] కూడా, తన ప్రసంగాల్లో కమ్యూనిస్టు నీతిని సుస్పష్టంగా ప్రకటించారు. ప్రజలపట్ల ప్రేమ, మానవత, సమిష్టితత్వం, రుజువర్తన,

1, 2. వీరిద్దరి రచనా శకలాలను ఈ ప్రతిలో చేర్చలేదు. – ఏటుకూరి ప్రసాద్

స్వార్థరాహిత్యం, పనిపట్ల శ్రద్ధ మొదలైనవి నూతన మానవుని లక్షణాలని ఆయన పలుసందర్భాలలో తెలియజేశారు. అవన్నీ ఈ పుస్తకంలో చేర్చబడ్డాయి.

ఈ సంకలనంలోని కొన్ని భాగాలు వర్గరహిత సమాజానికి వర్తించేవే అయినప్పటికీ, వాటి వేళ్ళు అట్టి సమాజ స్థాపనకై జరిగే పోరాటంలో రూపొందినవేనని పాఠకులు గమనించగలరు.

మాస్కోలో ప్రచురింపబడ్డ నాలుగు సంకలన గ్రంథాల్లోని కొన్ని భాగాలను ఎంచి, యీ సంపుటిలో కాలక్రమానుగతంగా చేర్చడమైంది. అవి:

1. Reminiscences of Marx and Engels
2. Communist morality
3. The Communist view of morality
4. Lenin, commrade and man

పాదపీఠికల్లో కొన్నిమాత్రం నావి. మిగతావి ఆయా గ్రంథాలలోనివి.

కొన్ని క్లిష్టమైన వాక్యాలు తెలుగు పాఠకునికి సులభంగా అర్థమయేందుకు, ముక్కస్య ముక్కార్థః కాకుండా, స్వేచ్ఛగా అనువదించాను. అట్టి సందర్భాల్లో శబ్దానువాద పద్ధతికి బదులు అర్థానువాద పద్ధతిని అనుసరించాను. పాఠకులు గమనింతురు గాక.

1-9-6/B, అజామాబాద్,
హైదరాబాద్-20.

**కంభంపాటి సత్యనారాయణ**

కారల్ మార్క్స్

(1818-1883)

ఫ్రెడరిక్ ఎంగెల్స్

(1820-1895)

# వృత్తి ఎన్నిక ఎలా?

...మనమొక వృత్తి నెంచుకోడానికి ప్రస్తుత పరిస్థితులు అనుమతించినట్లయితే, పరువు ప్రతిష్టలను అత్యధికంగా ఒనగూర్చే వృత్తిని మనమెంచుకో గల్గుతాం. యదార్థమైనవిగా నిరూపించుకోబడ్డ భావాలపై ఆధారపడే వృత్తిని మనమెంచుకో గల్గుతాం. మానవజాతికి మేలు చేకూర్చగల వృత్తిని, అత్యంత విస్తృతమైన కార్యకలాపాలకు అవకాశమిచ్చే వృత్తిని మన మెంచుకోగల్గుతాం. ఒక ఉమ్మడి లక్ష్యాన్ని చేరుకొనేందుకు, అనగా పరిపూర్ణత్వాన్ని సాధించేందుకు, దానికి మరింత చేరువయేందుకు ఒక పనిముట్టుగా ఉపయోగపడే వృత్తిని ఎంచుకోగల్గుతాం.

అన్నిటికంటే ముఖ్యంగా, మానవుని ఉన్నతుణ్ణి చేసేవి పరువు ప్రతిష్ఠలు; అవే అతని కార్యాలకు, కోర్కెలకూ ఘనత చేకూరుస్తాయి. ఈ ఘనతే అతణ్ణి యితరు లందరికంటే, భీరువులందరికంటే ఉన్నతుణ్ణి చేస్తుంది.

అయితే, యీ పరువు ప్రతిష్ఠలకు ఎలాంటి వృత్తి ప్రోద్బలమీయగల్గుతుంది? మనల్ని కేవలం విధేయతగల పనిముట్లుగా తయారుచేసే వృత్తికాక, మన జనం మధ్య స్వతంత్రకృషికి అవకాశమిచ్చేవృత్తి మాత్రమే, సృజనాత్మక కృషికి అవకాశమిచ్చే వృత్తి మాత్రమే అలాంటి ప్రోద్బల మీయగలదు. మనచే దూష్యమైన కార్యాలు (అవి పైకి మాత్రమే అలా కనిపించవచ్చు) చేయించే వృత్తి కాక, మనలో అత్యుత్తములైనవారూ సగర్వంగా చేబట్టే వృత్తి మాత్రమే అలాంటి ప్రోద్బలమీయ గల్గుతుంది. ఈ లక్షణాలన్నీ అత్యధికంగా ఉన్న వృత్తి ఎల్లప్పుడూ అత్యంత ఘనమైనదిగా ఉండకపోవచ్చు; కాని, అత్యంత వాంఛనీయంగా మాత్రం ఉంటుంది.

.... ఒక వ్యక్తి తన సొంత మేలుకే పాటుబడితే, అతడొక ప్రఖ్యాత సైంటిస్టుగానో, గొప్ప రుషిగానో, చక్కని కవిగానో తయారుకావచ్చు; కాని ఎన్నటికీ పరిపూర్ణ వ్యక్తిగా, మహాపురుషుడుగా తయారవడు.

ఎవరైతే లోక కళ్యాణం కొరకు కృషి చేయడంద్వారా తమ్ము తాము ఉన్నతుల్ని చేసుకుంటారో, వారినే చరిత్ర అత్యుత్తములుగా పరిగణిస్తుంది. అత్యధికులకు సౌఖ్యం చేకూర్చినవారే అందరికన్న అదృష్టవంతులని అనుభవం తెలియజేస్తుంది.

... మానవజాతికి అత్యధికంగా మేలు చేయగల వృత్తిని మనం ఎంచుకొన్నట్లయితే, మనం దేనికీ తలవంచనవసరంలేదు. ఎందుచేతంటే, అది అందరికోసం చేసే త్యాగం, అప్పుడు మనం పొందే ఆనందం అల్పమైనది కాదు; పరిమితమైనది కాదు; స్వార్థపూరితమైనది కాదు. ఎందుచేతనంటే, లక్షలాది ప్రజల సౌఖ్యమే మన సౌఖ్యం అవుతుంది; మన కార్యాలు ప్రపంచంలో శాశ్వతంగా నిలిచిపోతాయి; మన అస్తికలు మహానుభావుల అశ్రుధారలతో పునీతమవుతాయి.

- కారల్ మార్క్స్

*"ఏదైనా వృత్తినెంచుకోవటంపట్ల ఒక యువకుని మనోభావాలు"*

*(1835)*

*(వ్యాస భాగం)*

# పోరాటపాట

శాంతి పూర్ణమైన బతుకు నాకు వద్దు నాకు వద్దు
ఘూర్ణితా ర్ణవమ్ములాంటి నా మనసుకు పడదు శాంతి
పోరాటం పోరాటం పోరాటమె నాకిష్టం
మహోదాత్త మహోత్తాల లక్ష్యాంకితమైనట్టిది.

యుగయుగాల మానవాళి నలరించు కళాదేవి
సౌందర్యంసమస్తం నా అరచేతికి చిక్కుగాక
దిఙ్మండల సహితంగా యీ జగత్తు యావత్తూ
నా బుద్ధికి సులభంగా అవగాహన మౌనుగాక.

లక్ష్యరహిత గమ్యరహితమైన బతుకు వద్దు మనకు
నిస్సారపు నిర్జీవపు కాకి బతుకు వద్దు మనకు
పద పద పద పోదాం పద దూరంగా వేగంగా
కష్టాలను క్లేశాలను లెక్కించక పోదాం పద.

నిరుత్సాహ నిరుద్వేగ మిధ్యా జీవిత మెందుకు
గుది కాళుల గాడిదలా, చల్లారిన బూడిదలా-
అచ్చుమైన మనుషుల్లా నిండు బతుకు బతుకుదాం
కోపంతో, తాపంతో, రాగంతో, ద్వేషంతో.

*యువ మార్క్సు రచించిన గేయాలనుండి[3] (1836)*

3. అనువాదం: రా.రా.

# బానిసగా బతకొద్దు

కొాడికింద మెడపెట్టి బతకడమంటే నాకు పరమరోత - అది స్వేచ్ఛ పేరుతో చెలామణీ అయినాసరే. దుడ్డుకర్రతో బాదడానికి బదులు గుండు సూదితో పోరు సల్పడమంటే నాకు పరమ అసహ్యం. నేను కాపట్యం, మూర్ఖత్వం, నియంతృత్వం - వీటితో విసుగెత్తిపోయాను. ఎల్లప్పుడూ సర్దుకుపోవలసి రావడం, కుదించుకుపోవలసి రావడం, సాగిలపడవలసి రావడం, తప్పులెంచడానికి చేసే ప్రతి ప్రయత్నాన్నీ పరిగణనలోకి తీసుకోవలసి రావడం - వీటితో నేను విసిగి వేశారేను....

(మార్క్స్ సంపాదకత్వం కింద ప్రచురింపబడే రీనిష్ జీతుంగ్ పత్రిక నిషేధింపబడినప్పుడు రాసిన జాబు యిది. 1842 అక్టోబరులో ఆ పత్రిక ప్రారంభింపబడింది. నవంబరు మధ్యలో ప్రష్యన్ పాలకులకూ, పత్రిక సంపాదక వర్గానికీ మధ్య ఘర్షణ తీవ్రరూపం దాల్చింది. పత్రిక నిషేధింపబడకుండా చూచేందుకు చాలా గట్టి ప్రయత్నం చేశాడు, సంపాదకుడు మార్క్స్. కాని, లాభం లేకపోయింది. 1843 ఏప్రిల్ 1 నుంచి పత్రిక వెలువడకూడదని ప్రష్యన్ ప్రభుత్వం జనవరి 19 న ఉత్తర్వు జారీ చేసింది. మార్క్స్ యీ జాబు రాసింది జనవరి 25 న)

- కారల్ మార్క్స్

*ఎ. రూజ్‌కి రాసిన ఒక జాబు నుంచి (1843)*

# 'వ్యక్తి శక్తి అంచనా అంటే సమాజశక్తి అంచనా'

మానవుడు తన జ్ఞానాన్నంతటినీ, భావాలు తదితరాలన్నింటినీ ఇంద్రియ గ్రాహ్య ప్రపంచం నుంచీ, ఆ ప్రపంచంలో అతడు గడించే అనుభవంనుంచీ పొందుతున్నాడు. అందుచేత, ప్రపంచంలో నిజంగా మానవత్వం తొణికిసలాడే అనుభూతుల్నే అతడు పొందేటట్లుగా ప్రపంచం రూపొందింపబడాలి; అలాంటి అనుభూతులకే అతడు అలవాటుపడాలి; తాను మానవుణ్ణనే చైతన్యం అతనిలో కలగాలి. సక్రమంగా అర్థం చేసుకున్న ప్రయోజనమే నీతికంతకూ మూలం. అలాంటప్పుడు, మానవుని సొంత ప్రయోజనమూ, మానవజాతి సమిష్టి ప్రయోజనమూ ఒకటయేటట్లు మనం చూడాలి. భౌతిక దృష్టితో పర్యాలోకించినప్పుడు మానవుడు అస్వతంత్రుడు; అనగా, తన సిసలైన వ్యక్తిత్వాన్ని ఖచ్చితమైన స్వశక్తితో నిరూపించుకోడానికి అతనికి స్వేచ్ఛలేదు. అటువంటప్పుడు, వ్యక్తిచేసే నేరానికి వ్యక్తినే శిక్షించడం కాక, నేరాలకుతావిచ్చే సమాజ వ్యతిరేక మూలాంశాన్ని నిర్మూలించాలి. ప్రతి మానవుడు జీవశక్తి తొణికిసలాడే తన అస్తిత్వాన్ని నిరూపించుకొనేందుకు సమాజం అవకాశమీయాలి. మానవుడు తన పరిసరాల ప్రభావంవల్ల రూపొందుతాడు. అలాంటప్పుడు, అతని పరిసరాలు మానవతతో నిండి ఉండేటట్లు మనం చూడాలి. మానవుడు స్వాభావికంగా సంఘజీవి. అటువంటప్పుడు, అతడు తన నిజ స్వభావాన్ని సంఘంలోనే పెంచి పోషించుకుంటాడు. అతని స్వభావం ఎంత శక్తివంతమైనదో అంచనా వేయాలంటే, వేర్వేరు వ్యక్తుల శక్తిని అంచనా వేస్తే చాలదు; మొత్తం సమాజంయొక్క శక్తిని అంచనా వేయాలి.

*- కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్*
*"పవిత్ర కుటుంబం, లేదా సవిమర్శక విమర్శ పై విమర్శ"*
*అనే గ్రంథంనుంచి (1844)*

# నేరాలు-న్యాయస్థానాలు-సమాజం

....కమ్యూనిస్టు సమాజంలో వ్యక్తుల ప్రయోజనాలు ఒండొరుల ఉమ్మడి ప్రయోజనాలకు భిన్నంగా కాక, ఒకటిగా వుంటాయి. అందుచేత, పోటీ అనేది పూర్తిగా మాయమవుతుంది. కొన్ని వర్గాలు దారిద్ర్యం అనుభవించే స్థితి తొలగిపోతుంది. అసలు, ధనికులూ పేదలూ అను వర్గాలే గత కాలానివవుతాయి.

....ఈనాడు సమాజం తన సభ్యుల్ని నేరాల నుంచి, హింసాత్మక చర్యల నుంచి కాపాడ్డానికి విస్తృతమైన, సంక్లిష్టమైన పాలనా సంస్థల్నీ, న్యాయస్థానాల్ని పోషించవలసి వస్తోంది. వాటికోసం అపారమైన మానవశక్తిని వినియోగించవలసి వస్తోంది. కాని, కమ్యూనిస్టు సమాజంలో ఇది అపరిమితంగా సరళ మొనర్చబడుతుంది. ఎందుచేతంటే, పైకి విచిత్రంగా తోచినప్పటికీ, అధికార వర్గం ప్రజాజీవితానికి సంబంధించిన కొన్ని రంగాలకే కాక, మొత్తం ప్రజా జీవితానికే బాధ్యత వహిస్తుంది; దాని అన్ని రంగాలకూ, అన్ని రూపాలకూ బాధ్యత వహిస్తుంది. వ్యక్తికీ, సమాజానికీ మధ్య నున్న శత్రువైరుధ్యాలను (Antagonisms) మనం నిర్మూలించ పూనుకొన్నాం; సమాజ సమరానికి వ్యతిరేకంగా, సమాజ శాంతిని మనం రక్షిస్తున్నాం; నేరం యొక్క మూలాన్నే మనం ఛేదించబోతున్నాం; ఆ విధంగా, నేటి పాలక సంస్థల, న్యాయస్థానాల కార్యకలాపాల్లో అధిక భాగాన్ని - అత్యధిక భాగాన్ని - అనవసర మొనర్చుతాం. ఇప్పటికే వ్యక్తులు ఉద్రేకంతో చేసే నేరాల స్థానాన్ని ముందుగా ఆలోచించి చేసే నేరాలు, లేదా స్వార్థప్రయోజనం కొరకు చేసే నేరాలు, ఆక్రమిస్తున్నాయి; వ్యక్తులపై చేసే నేరాల సంఖ్య తగ్గుతూ, ఆస్తికోసం చేసే నేరాల సంఖ్య పెరుగుతోంది. ఈ రోజున, సమాజం ఒక యుద్ధస్థితిలో ఉన్నా, అభివృద్ధి చెందిన మన నాగరికత ఉద్రేకంతో చేసే అత్యంత హింసాత్మక చర్యల ఉధృతిని తగ్గించివేసింది. శాంతియుత కమ్యూనిస్టు సమాజంలో ఇది ఇంకా ఎంత వాస్తవమవుతుందో! ప్రతి వ్యక్తీ తన భౌతిక, సాంస్కృతిక

అవసరాలను తీర్చుకొనేందు కవసరమైన వాటన్నిటినీ కలిగియున్నప్పుడు, సామాజిక విభజనలూ వ్యత్యాసాలూ సమసిపోయినప్పుడు, ఆస్తికోసం జరిగే నేరాలు సహజంగా అదృశ్యమవుతాయి. క్రిమినల్ న్యాయశాస్త్రం దానంతట అదే మాయమవుతుంది. ఇంచుమించు పూర్తిగా ఆస్తి సంబంధాలకు మాత్రమే పరిమితమయే సివిల్ న్యాయశాస్త్రం కూడా అదృశ్యమవుతుంది. ఈ ఆస్తి సంబంధాలు సమాజంలోని శత్రువైరుధ్యాల ఫలితంగా సమాజంలో నేడున్న సాధారణ శత్రుత్వాల సహజ ఫలితమే లిటిగేషను. అది బహు అరుదుగా మాత్రమే తలెత్తుతుంది. తగాదాలు మధ్యవర్తి సంఘాలచే సులభంగా పరిష్కరించబడతాయి. ప్రస్తుతం పాలక సంస్థలు శాశ్వతమైన యుద్ధస్థితి ప్రాతిపదికపై తమ కార్యకలాపాలను కొనసాగిస్తున్నాయి. ఈ యుద్ధం పరోక్షంగా, జనాంతికంగా కొనసాగేటట్లూ, బాహాటమైన హింసాకాండగా, నేరాల రూపంలో బద్దలు కాకుండేటట్లూ చూడ్డానికి పోలీసు సిబ్బందీ, మొత్తం పరిపాలనా యంత్రం ప్రయత్నిస్తున్నాయి. కాని, యుద్ధాన్ని హద్దుల్లో పెట్టడం కన్నా శాంతిని కాపాడ్డం సులభం. అదే విధంగా నిత్యం పోటీతో సతమతమయే సమాజాన్ని అదుపులో పెట్టడంకన్న కమ్యూనిస్టు సమాజాన్ని అదుపులో పెట్టడం తేలిక. శాంతిభద్రతల రక్షణ, ప్రజా భద్రత రక్షణ, ప్రజా ప్రయోజనాల రక్షణ ప్రజలకే ఉపయోగకరమన్న విషయాన్ని యిప్పటికే నాగరికత బోధించింది. ఆ విధంగా పోలీసు సిబ్బంది, అధికారవర్గం, న్యాయస్థానాలు చేసే సేవ చాలావరకు అనవసరమయేటట్లు చేసింది. అందుచేత, అందరి ప్రయోజనాలు ఒకటిగా ఉండే సమాజంలో, అదొక మూలసూత్రంగా పరిగణింపబడే సమాజంలో, ప్రజల ప్రయోజనాలకూ వ్యక్తుల ప్రయోజనాలకూ వైరుధ్యం లేని సమాజంలో యిదంతా మరింత సులభం అవదా? ఇప్పటికే, యివన్నీ పబ్లిక్ సంస్థల ప్రమేయంలేకుండా జరిగిపోతున్నాయి. అటువంటప్పుడు, పబ్లిక్ సంస్థలు యీ కార్యకలాపాలను ఆటంకపరచడానికి బదులు ప్రోత్సహించడమే జరిగితే, అవి ఇంకా ఎంత విస్తృతంగా వ్యాప్తి చెందుతాయో!

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*"ఎల్బర్‌ఫేల్డ్ ఉపన్యాసాల" నుంచి (1845)*

# పీడితవర్గ సాంగత్యం

...నేను వారి (సంపన్నుల-సం.) సాంగత్యాన్నీ, విందు భోజనాల్నీ విసర్జించాను. మధ్యతరగతులు సేవించే పోర్టువైన్‌నీ, షాంపేన్నీ కాలదన్నేను. నా తీరిక సమయాన్ని యించుమించు పూర్తిగా సామాన్య కార్మికులతో సాంగత్యానికి వినియోగించాను. అలా చేసినందుకు నేను సంతోషపడ్డాను; గర్వపడ్డాను. సంతోషించడ మెందుకంటే, ఆవిధంగా జీవిత వాస్తవాలను తెలుసుకోవడానికి ఆనందదాయకంగా అనేక గంటలు గడపగలిగాను. లేకపోతే, ఆ సమయమంతా ఫాషన్లకు సంబంధించిన సంభాషణల్లోను, నిరర్థక మర్యాదల్లోను వ్యర్థమైపోయేది. గర్వించడమెందుకంటే, ఆ విధంగా నేను పీడితవర్గానికి, దూషిత వర్గానికి న్యాయం చేకూర్చేందుకు అవకాశం కలిగింది. ఆ వర్గంలో ఎన్ని లోపాలున్నా, ఎన్ని అననుకూల పరిస్థితుల్లో అది జీవిస్తున్నా, అది ప్రతి ఒక్కని నుంచీ - ఒక్క బ్రిటిష్ ధనాఢ్యుల నుంచి తప్ప - గౌరవం పొందుతూ ఉండేది. నేను మరొకందుకు కూడా గర్వపడ్డాను. ఆ విధంగా, నానాటికీ పెచ్చరిల్లే ఛీత్కారం నుంచి ఇంగ్లీషు ప్రజల్ని కాపాడగల స్థితికి నేను వచ్చాను. అట్టి ఛీత్కారం ఆనాడు యూరపు ఖండంలో వ్యాపించియుండేది. ఇందుకు కారణం ఒక్కటే. అది, మీ పాలకవర్గమైన మధ్యతరగతి (పెట్టుబడిదారులని భావం - సం.) కార్మికుల పట్ల అవలంబిస్తున్న పాశవిక స్వార్థపూరిత విధానం, సామాన్య ప్రవర్తన.

- *ఫ్రెడరిక్ ఎంగిల్స్*

*"గ్రేట్ బ్రిటన్‌లోని కార్మిక వర్గానికి" అనే ప్రసంగం నుంచి (1845)*

# నూతన వివాహ వ్యవస్థ

... ప్రశ్న 21: కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థ కుటుంబం మీద ఎట్టి ప్రభావం కలిగిస్తుంది?

జవాబు: స్త్రీ పురుష సంబంధాలు తద్వ్యక్తులకు మాత్రమే సంబంధించిన సొంత విషయంగా అది చేస్తుంది; సమాజం వాటితో జోక్యం కలిగించుకోకుండా చూస్తుంది. ఇలా ఎందుకు చేయగలుగుతుందంటే, సొంత ఆస్తిని రద్దుచేసి, బిడ్డలకు అది సామూహిక విద్య గరపుతుంది. ఆ విధంగా, యింతవరకు అమల్లో నున్న వివాహ వ్యవస్థ యొక్క రెండు పునాదుల్నీ అది నిర్మూలిస్తుంది. వాటిలో ఒకటి, భార్య భర్తమీద ఆధారపడి ఉండడం; రెండు, బిడ్డలు తల్లిదండ్రులమీద ఆధారపడి ఉండడం. ఈ రెండూ సొంత ఆస్తి యొక్క ఫలితాలే. కమ్యూనిస్టు వ్యవస్థ భార్యలందరినీ ఉమ్మడి భార్యలుగా మార్చుతుందంటూ బూటకపు నీతి బోధకులు చేసే గగ్గోలుకు ఒకటే సమాధానం. అదేమంటే, ఉమ్మడి భార్యల పద్ధతి పెట్టుబడిదారీ సమాజంలోనే పరిపూర్ణంగా అమలు జరుగుతోంది. అది ఈ రోజున వ్యభిచార రూపం ధరించింది. అయితే, వ్యభిచారం సొంత ఆస్తి నుంచి ఉద్భవించింది. దానితోనే అది అంతమవుతుంది. కాబట్టి, కమ్యూనిస్టు వ్యవస్థ ఉమ్మడి భార్యల పద్ధతిని రద్దు చేస్తుందేగాని, నెలకొల్పదు.

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*

*"కమ్యూనిస్టు సిద్ధాంతాలు" అనే కరపత్రం నుంచి (1847)*

# కమ్యూనిజం వెలుగులు

... పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడి స్వతంత్రశక్తి గలది, వ్యక్తిత్వం గలది. కాని, సజీవుడైన వ్యక్తి అస్వతంత్రుడు; వ్యక్తిత్వం లేనివాడు.

ఇలాంటి పరిస్థితిని రద్దు చేయడమంటే వ్యక్తిత్వాన్నే రద్దుచేయడంగా, స్వాతంత్ర్యాన్నే రద్దుచేయడంగా పెట్టుబడిదారీ వర్గం అర్థం చెబుతూంది! ఒక విధంగా యిది నిజమే. మన లక్ష్యం, నిస్సందేహంగా బూర్జువా (పెట్టుబడిదారీ) వ్యక్తిత్వాన్ని రద్దుచేయడం, బూర్జువా స్వాతంత్ర్యాన్ని రద్దుచేయడం, బూర్జువా స్వేచ్ఛను రద్దుచేయడం.

ప్రస్తుత పెట్టుబడిదారీ ఉత్పత్తి పరిస్థితుల్లో, స్వేచ్ఛ అంటే అర్థం స్వేచ్ఛా వ్యాపారం: క్రయ విక్రయాల్లో స్వేచ్ఛ.

కాని, క్రయ విక్రయాలే అదృశ్యమైనప్పుడు స్వేచ్ఛా వ్యాపారం కూడా అదృశ్యమవుతుంది. మన పెట్టుబడిదార్లు క్రయ విక్రయాల్లో స్వేచ్ఛ ఉండాలంటారు. అవధులు లేని స్వేచ్ఛను గురించి వారు మాట్లాడుతూ ఉంటారు. ఈ "గంభీరవాక్కులకు" అర్థమేమైనా ఉంటే అది పరిమితమైనది. మధ్యయుగాల్లో వర్తకులకు స్వేచ్ఛ ఉండేది కాదు. క్రయ విక్రయాల్లో ఆటంకాలుండేవి. కాని, కమ్యూనిస్టు వ్యవస్థలో క్రయ విక్రయాలే రద్దుచేయబడతాయి. బూర్జువా ఉత్పత్తి పరిస్థితులే నిర్మూలింపబడతాయి. బూర్జువా వర్గమే రద్దుచేయబడుతుంది. అటువంటి పరిస్థితుల్లో పై మాటలకర్థమే ఉండదు.

...శ్రమను ఏ క్షణం నుంచి పెట్టుబడిగా, ధనంగా, కౌలుగా, గుత్తాధికారం చెలాయించగల సామాజిక శక్తిగా మార్చడం సాధ్యపడదో, అంటే ఏ క్షణం నుంచి వ్యక్తిగత ఆస్తిని బూర్జువా ఆస్తిగా, పెట్టుబడిగా మార్చడం సాధ్యపడదో, ఆ క్షణం నుంచి వ్యక్తిత్వం అదృశ్య మవుతుందంటారు, మీరు.

అందుచేత, మీరొక విషయం ఒప్పుకోవాలి: "వ్యక్తి" అంటే మీ అర్థం పెట్టుబడిదారు తప్ప మరొకడు కాదు: సొంత ఆస్తిగలవాడు తప్ప మరొకడు కాదు. అలాంటి వానిని తోవనుంచి తొలగించాలి. వాని ఉనికిని అసాధ్యమొనరించాలి.

సమాజం ఉత్పత్తి చేసే వస్తువుల్ని స్వాయత్తం చేసుకొనే అధికారం ప్రతివ్యక్తికీ ఉంటుంది. దాన్ని కమ్యూనిజం రద్దు చేయదు. అది చేసేదల్లా ఒక్కటే: అలా స్వాయత్తం చేసుకోనేందుకై యితరుల శ్రమను తన అధీనంలోకి తెచ్చుకొనే అధికారాన్ని రద్దు చేస్తుంది.

ఇంకొక ఆక్షేపణ ఏమంటే, సొంత ఆస్తి రద్దుచేయబడ్డాక మొత్తం పని స్తంభించిపోతుందనీ, సమస్త జనులు సోమరులవుతారనీను.

వీరు చెప్పేదాని ప్రకారం, పెట్టుబడిదారీ సమాజం ఏనాడో సోమరితనంవల్ల ఛిన్నాభిన్నమై యుండేది. ఎందుచేతనంటే, పెట్టుబడిదారీ సమాజంలో కష్టించి పనిచేసేవారు ఏ ఆస్తీ సంపాదించటంలేదు. కొంత ఆస్తి అయినా సంపాదించినవారు పనిచేయడంలేదు. వీరు చెప్పే అభ్యంతరమంతా ఒకటే. అది, పెట్టుబడి అనేది లేనప్పుడు కూలికిచేసే శ్రమ కూడా ఉండదని మారు మాటల్లో చెప్పడమే.

భౌతిక సంపదను కమ్యూనిస్టు పద్ధతిలో ఉత్పత్తిచేసి స్వాయత్తం చేసుకోడానికి వీరు ఏ అభ్యంతరాలైతే చెబుతున్నారో, వాటన్నిటినీ కమ్యూనిస్టు పద్ధతుల్లో భావసంపదను ఉత్పత్తిచేసి స్వాయత్తం చేసుకోడానికి కూడా చెబుతున్నారు. పెట్టుబడిదారు దృష్టికి వర్గ ఆస్తి అదృశ్యమవడమంటే మొత్తం ఉత్పత్తే అదృశ్యమవడంగా కనిపిస్తుంది; అలాగే, వర్గ సంస్కృతి అదృశ్యమవడం మొత్తం సంస్కృతే అదృశ్యమవడంగా కనిపిస్తుంది.

ఏ సంస్కృతి ఐతే అదృశ్యమవుతుందని అతడు విలపిస్తాడో, ఆ సంస్కృతి అత్యధికుల్ని యంత్రాల మాదిరిగా పనిచేసేటట్లు తయారుచేస్తుంది.

కాని, మేము తలపెట్టిన బూర్జువా ఆస్తి రద్దును మీరు బూర్జువా భావాల - స్వేచ్ఛ, సంస్కృతి, చట్టం వగైరా - కొలబద్దతో కొలిచేటంత కాలం మాతో తగాదా పడకండి. ఉదాహరణకు, మీ న్యాయశాస్త్రం మీ వర్గంయొక్క అభీష్ట ధర్మం. అయినా అది అందరికోసమూ చేయబడిన

చట్టంగా చెలామణిలో వుంది. దాని స్వభావం, దాని దిశ మీ వర్గ ఆర్థిక పరిస్థితులచే నిర్ధారింపబడుతున్నాయి. ఇదే మీ భావాలకు కూడా వర్తిస్తుంది. మీ భావాలు మీ బూర్జువావర్గ ఉత్పత్తి పరిస్థితులనుంచి, బూర్జువా ఆస్తినుంచి ఉద్భవిస్తున్నాయి...

...అమ్మో, కుటుంబ వ్యవస్థ నిర్మూలనే! కమ్యూనిస్టుల ఈ పాడు సూచనకు అతివాదుల్లో అతివాదులు సైతం మండిపడుతున్నారు.

నేటి కుటుంబం, అనగా బూర్జువా కుటుంబం, ఏ పునాది మీద ఆధారపడివుంది? పెట్టుబడి మీద; సొంత లాభంమీద. దీని పరిపూర్ణ స్వరూపం పెట్టుబడిదార్లలోనే కనిపిస్తుంది. కాని, దీనికి మరో పార్శ్వం కూడా ఉంది. అది శ్రామికుల్లో అసలు కుటుంబమే లేకపోవడం, బహిరంగ వ్యభిచారమూను.

ఈ రెండవ పార్శ్వం అదృశ్యమైననాడు, బూర్జువా కుటుంబం దానంతట అదే అదృశ్యమవుతుంది. పెట్టుబడి అదృశ్యమైనప్పుడు, ఈ రెండూ కూడా అదృశ్యమవుతాయి.

తల్లిదండ్రులు బాలల్ని పీడించే పద్ధతిని మేము అరికట్టదలచుకున్నామని కదా, మీరు మామీద తెస్తున్న అభియోగం? నిజమే. మేమీ నేరాన్ని అంగీకరిస్తాం.

మేము గృహవిద్యకు బదులు సాంఘిక విద్యను ప్రవేశపెడతామనీ, ఆ విధంగా పరమ పవిత్రమైన సంబంధాలను కూలదోస్తామనీ మీరంటారు.

అసలు, మీరు కోరే విద్య ఎలాంటిది? అదికూడా సాంఘికమైనది కాదా? ఏ సామాజిక పరిస్థితులలో మీరు బాలలకు విద్య గరుపుతున్నారో, ఆ పరిస్థితులే కాదా దాని స్వభావాన్ని నిర్ణయించేది? పాఠశాలలు మొదలైన వాటిద్వారా సమాజం ప్రత్యక్షంగానో పరోక్షంగానో తీసుకొనే జోక్యమే కాదా, దాని స్వభావాన్ని నిర్ణయించేది? ఈ సమాజ జోక్యాన్ని కమ్యూనిస్టులు సృష్టించలేదు; వారు కోరేదల్లా, దాని స్వభావాన్ని మార్చాలని మాత్రమే; విద్యను పాలకవర్గ ప్రభావం నుంచి రక్షించాలని మాత్రమే.

ఆధునిక పరిశ్రమల పుణ్యమా అని, శ్రామికుల్లో కుటుంబ సంబంధాలన్నీ మరింతగా విచ్ఛిన్నమయాయి. వారిబిడ్డలు కేవలం

వ్యాపార వస్తువులుగా, శ్రమించే పనిముట్లుగా మారిపోయారు. ఇట్టి పరిస్థితుల్లో, బూర్జువా వర్గం - కుటుంబాన్ని గురించీ, విద్యను గురించీ, తల్లిదండ్రులకు వారి బిడ్డలకు గల సంబంధాల పవిత్రతను గురించీ వల్లించే బూటకపు స్తోత్రపాఠాలు మరింత అసహ్యం కలిగిస్తాయి.

కాని, కమ్యూనిస్టులు స్త్రీలను సమాజపరం చేస్తారంటూ పెట్టుబడిదారులంతా బృందగానం చేస్తున్నారు.

పెట్టుబడిదారు తన భార్యను కేవలం ఉత్పత్తి సాధనంగా పరిగణిస్తాడు. భవిష్యత్తులో సమాజం ఉత్పత్తి సాధనాలన్నింటినీ సమిష్టిగా ఉపయోగించుకొంటుందని అతడు వింటాడు. అందుచేత, స్త్రీలుకూడా సమాజపు సమిష్టి సొత్తుగా తయారవుతారని సహజంగా నిర్ధారణకువస్తాడు. మరో నిర్ధారణకు అతడు రాజాలడు.

నేడు స్త్రీలు కేవలం ఉత్పత్తి సాధనాలుగా ఉన్నారనీ, ఆ స్థితిని రూపుమాపడమే మన అసలు ఉద్దేశమనీ అతనికి అనుమానమైనా తగలదు.

స్త్రీలు సమాజపు ఉమ్మడి సొత్తుగా ఉండే వ్యవస్థ నెలకొల్పబడనున్నట్లు కమ్యూనిస్టులు బాహాటంగా, అధికారయుతంగా చెబుతున్నారంటూ పెట్టుబడిదార్లు కట్టుకథలల్లుతున్నారు. అట్టి సమాజం పట్ల పవిత్ర ఆగ్రహం వెళ్ళగక్కుతున్నారు. ఇంతకంటే హాస్యాస్పదమైన విషయం ఇంకొకటి ఉండదు. ఎందుచేతంటే, అలాంటి వ్యవస్థను కమ్యూనిస్టులు ప్రవేశపెట్టవలసిన అవసరం లేదు. ఇంచుమించు అనాదినుంచి అట్టి వ్యవస్థ ఉండనే ఉంది.

మన పెట్టుబడిదార్లు తమ ఆధీనంలోని శ్రామికుల భార్యలతోను, కూతుళ్ళతోను సంతృప్తిచెందక, బజారు పడుపుగత్తెలతోనూ సంతృప్తి చెందక, ఒకరి భార్యల్ని ఒకరు చెరచడంలో అమితానందం పొందుతారు.

నిజం చెప్పాలంటే, బూర్జువా వివాహం ఉమ్మడి భార్యల వ్యవస్థ. అందుచేత, కమ్యూనిస్టుల్ని ఏ కారణం చేతైనా నిందించవలసివస్తే, ప్రస్తుతం అమల్లోవున్న బూటకపు పద్ధతికి బదులు చాటుమాటు పద్ధతికి బదులు బహిరంగ పద్ధతిని చట్టబద్ధ పద్ధతిని వారు ప్రవేశపెట్టదలచు కున్నారని మాత్రమే. అందుచేత, మనకొక విషయం చాల స్పష్టంగా బోధపడుతుంది. అదేమంటే, ప్రస్తుత ఉత్పత్తి విధానం రద్దుచేయబడితే,

దానితోబాటు, ఆ విధానం నుంచి ఉత్పన్నమైన స్త్రీల పరిస్థితి కూడా రద్దవుతుంది. అంటే, స్త్రీలు సమాజపు సొత్తుగా ఉండే పద్ధతి రద్దవుతుందన్నమాట, రహస్య, బహిరంగ వ్యభిచారం రద్దవుతుందన్న మాట....

...ఇక, కమ్యూనిజం మీద మత దృక్పథంతో, తాత్విక దృక్పథంతో, స్థూలంగా సిద్ధాంత దృక్పథంతో తేబడే అభియోగాలను ఖండించడానికి మనం లోతయిన పరిశీలన చేయనక్కరలేదు.

మానవుని భౌతిక జీవిత పరిస్థితులు, అతని సామాజిక సంబంధాలు, సామాజిక జీవితం మార్పు చెందితే అతని భావాలు, అభిప్రాయాలు, ఆలోచనలు కూడా మార్పు చెందుతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే, అతని చైతన్యం మార్పు చెందుతుంది. ఈ విషయం తెలుసుకొనేందుకు ప్రగాఢమైన ప్రతిభా విశేషం అవసరమా?

భౌతిక ఉత్పత్తి ఏ నిష్పత్తిలో మారితే, ఆ నిష్పత్తిలో భావోత్పత్తి స్వభావం కూడా మారుతుంది. ఇది తప్ప, భావాల చరిత్ర రుజువుచేసేది మరేముంది? ప్రతి యుగంలోనూ ప్రాబల్యం వహించే భావాలు ఆ యుగపు పాలక వర్గ భావాలే.

కొన్ని భావాలు సమాజంలో విప్లవ మార్పు తీసుకొస్తాయని కొందరంటూ ఉంటారు. అలా అనడంలో వారొక విషయాన్ని వ్యక్తంచేస్తున్న వారవుతున్నారు. అదేమంటే, పాత సమాజంలో కొత్త సమాజపు బీజాలు ఇమిడివున్నాయని; పాత జీవిత పరిస్థితులు విచ్ఛిన్నమయేకొద్దీ పాత భావాలు కూడా విచ్ఛిన్నమవుతాయని.

ప్రాచీన ప్రపంచం (బానిస సమాజం అని భావం-సం.) కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్నప్పుడు క్రైస్తవ మతం ప్రాచీన మతాలను ఓడగొట్టింది. ఎనిమిదవ శతాబ్దంలో క్రైస్తవ భావాలు హేతుభావాలకు తలవంచినప్పుడు ఫ్యూడల్ సమాజం ఆనాటి విప్లవ బూర్జువా వర్గంతో పోరాడి పతనమయింది. మత స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం వంటి భావాలు జ్ఞానరంగంలో స్వేచ్ఛా వ్యాపార ప్రాబల్యాన్ని వ్యక్తం చేస్తాయి.

కొందరు యిలా వాదించవచ్చు: "నిజమే. మత భావాలు, నైతిక భావాలు, తాత్విక భావాలు, న్యాయశాస్త్ర సంబంధమైనవి చారిత్రకాభివృద్ధిలో నిస్సందేహంగానే మార్పుచెందాయి. కాని, మతం,

నీతి, తత్వశాస్త్రం, రాజనీతి శాస్త్రం, న్యాయశాస్త్రం మాత్రం మార్పుకు లోనుకాకుండా, నిరంతరాయంగా నిలిచియున్నాయి. అంతేకాక - స్వేచ్ఛ, న్యాయం వంటి శాశ్వత సత్యాలు కూడా కొన్ని ఉన్నాయి. ఇవి అన్ని సామాజిక స్థితులకు సమానమే. కాని, కమ్యూనిజం యీ శాశ్వత సత్యాలనూ, మొత్తం మతాన్నీ, యావత్తు నీతినీ కొత్త పునాదిమీద నిర్మించడానికి బదులు, వాటన్నిటినీ రద్దుచేస్తుంది; అందుచేత, అది గత చారిత్రకానుభవానికే వ్యతిరేకంగా వ్యవహరిస్తుంది."

ఈ అభియోగం యొక్క సారాంశమేమిటి?

గత సమాజ చరిత్ర అంతా వర్గ వైషమ్యాల (Class antagonisms) అభివృద్ధి క్రమం. ఆ వైషమ్యాలు భిన్నయుగాల్లో భిన్నరూపాలు దాల్చాయి. కాని, ఈ రూపాలు ఏవైనా, ఒకటిమాత్రం అన్ని యుగాల్లోను మనకు కనిపిస్తుంది. అదేమంటే, సమాజంలో ఒక భాగం మరొక భాగాన్ని దోచుకోవడం. అటువంటప్పుడు, సామాజిక చైతన్యం గత యుగాల్లో ఎన్నివిధాలుగా, ఎంత బహుళంగా ప్రత్యక్షమైనా, అది సహజంగా కొన్ని సామాన్య రూపాల్లో, సామాన్య భావాల్లో చలిస్తూవచ్చింది. ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. వర్గ వైషమ్యాలు అదృశ్యమైతేగాని, ఆ సామాన్యభావాలు పూర్తిగా సమసిపోవు.

ఇదీ, ఉన్న విషయం.

కమ్యూనిస్టు విప్లవం సాంప్రదాయక ఆస్తి సంబంధాలను అతి తీవ్ర రూపంలో విచ్ఛిన్న మొనర్చుతుంది. అందుచేత, దాని పురోగతి సాంప్రదాయక భావాలను అతి తీవ్ర రూపంలో నాశనం చేస్తుంది....

...కమ్యూనిస్టులు కార్మికవర్గ తక్షణ లక్ష్యాల, తాత్కాలిక ప్రయోజనాల సాధనకై పోరాడుతారు; కాని, వారు సమకాలీన ఉద్యమాల్లో ఆ ఉద్యమ భవిష్యత్తును కూడా కాపాడుతారు; దానికి వారు ప్రాతినిధ్యం వహిస్తారు.

క్లుప్తంగా చెప్పాలంటే, కమ్యూనిస్టులు అన్నిచోట్లా నేటి సామాజిక, రాజకీయ పరిస్థితులకు వ్యతిరేకంగా ప్రతి విప్లవోద్యమాన్నీ బలపరుస్తారు.

ఆ ఉద్యమాలన్నిటిలోనూ వారు ఆస్తి సమస్యను - ఆ ఆస్తి ఫలానా సమయంలో ఏ స్థాయికి వృద్ధి చెందిందనే విషయంతో నిమిత్తం లేకుండా - ముందుకు తీసుకొస్తారు.

చివరగా, కమ్యూనిస్టులు అన్ని దేశాల్లోని ప్రజాతంత్ర పార్టీల మధ్య ఐక్యతకోసం, ఒడంబడిక కోసం కృషిచేస్తారు.

కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలను, ఆశయాలను దాచుకోవడమంటే అసహ్యించుకొంటారు. నేడు అమల్లో ఉన్న సమస్త సామాజిక పరిస్థితుల్నీ బలప్రయోగంతో కూలదోయడంద్వారానే తమ లక్ష్యాలను సాధించుకోగలమని బహిరంగంగా వారు ప్రకటించుకొంటారు. కమ్యూనిస్టు విప్లవం పాలకవర్గాలను హడలెత్తేటట్లు చేయుగాక. శ్రామికులు తమ సంకెళ్ళను తప్ప వేనినీ కోల్పోరు. వారొక ప్రపంచాన్నే గెలుచుకొంటారు.

సకలదేశాల కార్మికులారా, ఏకంకండి!

*- కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్*
*"కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక" నుండి (1847-48)*

# ప్రేమతత్త్వం

ప్రియతమా,

నేను నీకు మళ్ళీ రాయడానికి కారణమేమంటే, ప్రస్తుతం నే నొంటరితనం అనుభవిస్తున్నాను. అంతేకాక, నేను నీతో కేవలం ఆలోచనల్లోనే మాట్లాడ్డం, అందులోనూ యిదసలే తెలియని నీతో మాట్లాడ్డం చాలా కష్టంగా ఉంది. నేను చెప్పేది నీవు వినలేవు; జవాబు చెప్పలేవు. అట్టి నీతో కేవలం ఆలోచనల్లోనే మాట్లాడ్డం చాలా కష్టంగా ఉంది... నిజంగా, నిన్ను నేను వెన్నిస్ సైన్యాధిపతి అయిన ఆ మూర్ జాతీయుడు[4] ఒకప్పుడు ప్రేమించిన దానికన్న గాఢంగా ప్రేమిస్తున్నాను... ఈ బొంకులాడి ప్రపంచం, యీ మూర్ఖ ప్రపంచం యితరుల్ని గురించి కృత్రిమ భావాలేర్పరచుకొంటుంది; పైపై అభిప్రాయాలేర్పరచుకొంటుంది. నన్ను గురించి అపనిందలు వ్యాప్తి చేసేవారు, నాల్కలనుంచి విషం కక్కే శత్రువులు చాలమంది ఉన్నారు గాని, వారెవరూ నేను రెండవ తరగతి నాటకశాలలో తొలి ప్రేమికుని పాత్ర ధరించడానికి మాత్రమే అర్హుణ్ణని ఆక్షేపించి యుండలేదు. కాని, యిప్పుడదే జరుగుతోంది. ఈ తుచ్ఛులకు అణుమాత్రపు హాస్యదృష్టి అయినా ఉన్నట్లయితే, వారొక అట్టబోర్డు మీద ఒక పక్క "ఉత్పత్తి, మారకపు సంబంధాలు" అని రాసి, రెండవ పక్క నీ పాదాల మీద నేనున్నట్లు చిత్రించి, దానికింద "మొదట యీ చిత్రాన్నీ

4. షేక్స్‌పియర్ రచించిన "ఒథెల్లో" అను నాటకంలో ఒథెల్లో మూర్ జాతికి చెందిన ఒక సైన్యాధిపతి. అతన్ని ఒక వెన్నిస్ సెనేటరు కుమార్తె డెస్డిమోనా రహస్యంగా వివాహమాడుతుంది. ఆమెను అతడు అమితంగా ప్రేమిస్తాడు. కాని, అయాగో అనుసైనికుడు, అధికార వాంఛతో చేసిన ఒక కుయుక్తి ఫలితంగా, ఒథెల్లో ఆమెను శంకించి హత్య చేస్తాడు. తర్వాత నిజం తెలుసుకొని, ఆత్మహత్య చేసుకుంటాడు.

తర్వాత దాన్నీ తిలకించండి"[5] అని రాసియుండేవారు. మనం ఏ క్షణంలో ఒకరికొకరం దూరమవుతామో, ఆ క్షణంలో నాకొకటి స్ఫురణకొస్తుంది. అదేమంటే: సూర్యుడూ, వర్షం మొక్కల కొనగూర్చే ప్రయోజనమే కాలం ప్రేమకు ఒనగూరుస్తుంది. అంటే, పెరగడానికది తోడ్పడుతుందన్నమాట. నీవు నాకు ఏ క్షణంలో దూరమవుతావో, ఆ క్షణంలో నీ పట్ల నా ప్రేమ బృహద్దర్శనమిస్తుంది; ఒక మహాకాయునిలా నా ముందు నిలుస్తుంది. దానిలో నా యావదాత్మబలం, యావద్భావనా శక్తీ కేంద్రీకృతమవుతాయి. అప్పుడు నేను మళ్ళీ మానవుణ్ణవుతాను, సమగ్రమైన అర్థంలో. ఎందుచేతంటే, అప్పుడొక అద్భుతమైన భావోద్వేగం నాలో కలుగుతుంది. ఈరోజున విద్య మనకు ఏ పద్ధతిలో నేర్పబడుతుందో, ఏ పద్ధతిలో మనం పెంచి పోషింపబడుతున్నామో, ఆ పద్ధతి మనలో అతి సులభంగా మార్పుచెందే గుణాన్ని ప్రవేశపెడుతోంది; మనలోని సంశయ ప్రవత్తి మన భావాల్ని మనమే శంకించేటట్లు చేస్తూంది. ఇవన్నీ మనల్ని అల్పమనస్కులను చేస్తున్నాయి; దుర్బలుల్ని చేస్తున్నాయి; తప్పులెంచేటట్లు చేస్తున్నాయి; అనిశ్చితుల్ని చేస్తున్నాయి. అయితే, మానవుణ్ణి అత్యున్నతునిగా చేసేది ఫ్యూయెర్‌బా[6] వర్ణించిన "మానవుని" పట్ల, లేదా మెలెస్కాట్ వర్ణించిన "జీర్ణప్రక్రియ" పట్ల; లేదా శ్రామికవర్గం పట్ల ప్రేమకాదు; తన కత్యంత ప్రియమైన వ్యక్తిపట్ల ప్రేమ మాత్రమే అతణ్ణి అత్యున్నతుని చేస్తుంది...

ప్రపంచంలో స్త్రీలనేకమంది ఉన్నారు; సందేహం లేదు. వారిలో కొందరు అపురూప సౌందర్యవతులు. కాని, నీ ముఖంలో తప్ప మరెవరి ముఖంలో ప్రతి కవళిక, ప్రతి ముడత అత్యంత శక్తివంతమైన, అత్యంత సుందరమైన జీవితస్మృతుల్ని మేల్కొల్ప గలుగుతుంది? నీ అత్యంత ప్రియమైన ముఖంలో నేను నా అత్యంత క్రూరమైన బాధల్ని

5. షేక్స్పియర్ రచించిన "హామ్లెట్" అను నాటకంలో, డెన్మార్కు రాజు భార్యను అతని తమ్ముడు బలాత్కరించి, తర్వాత అన్నను హత్య చేస్తాడు. ఆ తర్వాత అన్న కుమారుడైన హామ్లెట్‌ని రాజుగా చేసి, అన్న భార్యను వివాహమాడుతాడు. హామ్లెట్ దిక్కుతోచని స్థితిలోపడతాడు. అప్పుడతనికి తండ్రి దయ్యం ఎదురుగా వచ్చి నిలబడుతుంది అది, పినతండ్రి మీద పగ సాధించమని బోధిస్తుంది. హామ్లెట్ తన తండ్రి చిత్ర పటాన్నీ దయ్యాన్నీ ఒక దాని తర్వాత ఒకటి చూస్తూ అన్నమాటలివి.

6. ఫ్యూయర్ బా (1804-72) జర్మన్ భౌతికవాది.

చదవగలను; ఇక యెన్నడూ పూడ్చలేని నా ఘోర నష్టాన్ని సైతం[7] గుర్తించగలను. నీ ముఖాన్ని నేను ముద్దులతో ముంచెత్తినప్పుడు నా బాధ అంతా అదృశ్యమవుతుంది. ఒక కవి రాసినట్లు, "ఆమె కౌగిలిలో నేను పూడ్చుకుపోతాను; తిరిగి ఆమె ముద్దులతో పునరుత్థాన మవుతాను..." ఆ కౌగిలీ నీదే; ఆ ముద్దులూ నీవే; అయితే, పునర్జన్మను బోధించే బ్రాహ్మణులు గాని, పైథాగొరస్ గాని[8] నాకక్కర్లేదు. పునరుత్థానం గూర్చి చెప్పే క్రైస్తవ మతమూ అక్కర్లేదు...

ప్రియతమా, ఇక నేనుంటాను. నీకూ బిడ్డలకూ వేయి ముద్దులు.

– నీ కారల్.

*కారల్ మార్క్సు తన భార్య జెన్నీకి రాసిన ఒక జాబు నుంచి (1856)*

7. మార్క్సు కుమారుడు ఎడ్గార్ మరణాన్ని గురించి చెబుతున్న మాటలు.
8. పైథాగొరస్ (క్రీ.పూ. 6వ శతాబ్దం) గ్రీకు తత్వవేత్త.

# ఓటమి బలవర్ధకం

...నిజంగా శక్తివంతులైన మహా పురుషులందరూ - ఉదాహరణకు వృద్ధ లెవాసియూర్[9], కాబెట్[10], రాబర్టు ఓవెన్[11], వెలెవెల్[12], జనరల్ మెల్లినె[13] ఒకనాడు విప్లవ పంథాలో పయనించిన వారంతా ఓటమి నుంచి సైతం బలాన్ని పుంజుకొని, చరిత్ర అనే ప్రవాహంలో ఈదినకొద్దీ దృఢచిత్తులై వ్యవహరించారు....

- కారల్ మార్క్స్

*జె. బెకర్‌కి[14] రాసిన ఒక జాబు నుంచి (1862)*

9. రెనీ లెవాసియూర్ (1747-1834) 18వ శతాబ్దం చివర జరిగిన ఫ్రెంచ్ విప్లవంలో పాల్గొన్నారు; కాన్వెంటులో సభ్యుడు; జాకోబిన్ గ్రూపుకు చెందినవాడు.

10. విలియం కాబెట్ (1762-1855) బ్రిటీష్ రాజకీయనాయకుడు, వ్యాసకర్త; బ్రిటన్‌లో రాజకీయ వ్యవస్థను ప్రజాతంత్రయుత మొనర్చడానికి పాటుపడ్డారు.

11. రాబర్టు ఓవెన్ (1771-1858) బ్రిటన్‌కి చెందిన గొప్ప ఊహాజనిత సామ్యవాది.

12. జోషిమ్ వెలెవెల్ (1786-1861) పోలెండ్‌కు చెందిన చరిత్ర రచయిత, విప్లవకారుడు; 1830-31లో జరిగిన పోలిష్ తిరుగుబాటు నాయకుల్లో ఒకడు.

13. ఫ్రాంకాయ్ మెల్లినె (1786-1852) ఫ్రాన్స్‌లో జన్మించిన బెల్జియన్ సైన్యాధిపతి; 1830లో జరిగిన బెల్జియన్ బూర్జువా విప్లవంలో చురుగ్గా పాల్గొన్నారు. బెల్జియన్ ప్రజాతంత్ర ఉద్యమంలో కూడా పాల్గొన్నారు.

14. జాన్ ఫిలిప్ బెకర్ (1809-86) జర్మన్ కార్మికోద్యమంలోను, అంతర్జాతీయ కార్మికోద్యమంలోను, 1848-49 నాటి విప్లవంలోను ప్రముఖ పాత్ర వహించినవారు; 1860-70 మధ్య మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొన్నారు. మార్క్స్, ఎంగెల్స్‌లకు మిత్రుడు, బలపరచినవాడు.

# మానవ సంబంధాలు

...1864 సెప్టెంబరు 28న లండన్‌లోని సెంట్ మార్టిన్స్ హాలులోజరిగిన బహిరంగసభ తీర్మానానుసారం అధికారాన్ని స్వీకరించిన కమిటీలో ఈ దిగువ సంతకాలు చేసిన సభ్యులం కార్మిక ప్రజల అంతర్జాతీయ అసోసియేషన్ స్థాపన కవసరమైన చర్యలు తీసుకోవడమయింది.

ఈ అంతర్జాతీయ అసోసియేషనూ, దానికి కట్టుబడియున్న ఇతర సంస్థలూ, వ్యక్తులూ ఒండొరుల మధ్య జాతి - మత - వర్ణ భేదాలతో నిమిత్తం లేకుండా, మానవులందరి మధ్య సంబంధాలు సత్యం, న్యాయం, నీతి అనే వాటిని ప్రాతిపదికగా చేసుకోవడం జరుగుతుందని ఇందుమూలంగా ప్రకటిస్తున్నాం.

మేమిలా అభిప్రాయపడుతున్నాం: ప్రతివ్యక్తీ తన కోసమే కాక, విధుల్ని నిర్వర్తించే 'ప్రతి వ్యక్తికోసం మానవ హక్కుల్నీ, పౌరహక్కుల్నీ చాటిచెప్పాలి. అలా చాటిచెప్పడం ప్రతివ్యక్తి కర్తవ్యమని మేము అభిప్రాయపడుతున్నాం. విధుల్ని నిర్వర్తించనిదే హక్కులు లేవు. హక్కుల్ని రక్షించనిదే విధులు లేవు...

- కారల్ మార్క్స్

*"అంతర్జాతీయ కార్మిక ప్రజల అసోసియేషన్[15] ప్రకటన. తాత్కాలిక నిబంధనలు" నుంచి (1864)*

15. ఇది ఆ తర్వాత మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ అని పిలువబడసాగింది.

# మార్క్సు విశ్వాసాలు[16] (1865)

| | |
|---|---|
| మీ కతి ప్రియమైన సద్గుణం : | నిరాడంబరత |
| పురుషులలో మీ కతి ప్రియమైన సద్గుణం : | సశక్తత |
| స్త్రీలో మీ కతి ప్రియమైన సద్గుణం : | అశక్తత |
| మీలో ప్రధాన లక్షణం : | ఏకాగ్రత |
| సౌఖ్యమనగా మీ భావం : | పోరాడటం |
| దౌర్భాగ్యస్థితి అనగా మీ భావం : | లొంగుబాటు |
| మీ రన్నిటికంటే ఎక్కువగా క్షమించే దుర్గుణం : | వంచింపబడటం |
| మీ రన్నిటికంటే అసహ్యించుకొనే దుర్గుణం : | దాసత్వం |
| ఎవరంటే మీ కతి చీదర? : | మార్టిన్ టప్పర్[17] |
| మీ కతి ప్రియమైన వృత్తి : | గ్రంథ భక్షణ |
| మీ కతి ప్రియమైన కవి : | షేక్స్పియర్, ఎచిలస్[18], గెథె[19] |
| మీ కతి ప్రియమైన గద్య రచయిత : | డిడెరో[20] |
| మీ కతి ప్రియమైన నాయకుడు : | స్పార్టకస్[21],కెప్లర్[22] |

16. ఈ ప్రశ్నలూ, వీటికి మార్క్సు యిచ్చిన జవాబులూ మూడు ప్రతుల్లో ఉన్నాయి. ఆ మూడూ, కొద్దిపాటి తేడాలతో, సమానమే. ఒకటి మార్క్సు భార్య జెన్నీ వద్ద. మరొకటి మార్క్సు కుమార్తె లారా వద్ద ఉన్నాయి. మూడవది యిదీ. ఇది, మాస్కో ప్రగతి ప్రచురణాలయంవారి "కమ్యూనిస్టు మొరాలిటీ" (కమ్యూనిస్టు నీతి) అనే పుస్తకంలో ప్రచురింపబడింది.

17. మార్టిన్ టప్పర్ (1810-89) ఆంగ్ల రచయిత. ఇతని లక్షణం సర్వసామాన్యత అని మార్క్సు అభిప్రాయం. ఇతని రచనల్లో చౌకబారు జనరంజకత్వం సాధించాలనే తపన కనబడుతుంది.

18. ఎచిలస్ (క్రీ.పూ. 525-456) గ్రీక్ నాటక రచయిత.

19. గెథె (1749-1832) జర్మన్ కవి, నాటక రచయిత.

20. డిడెరో (1713-84) ఫ్రెంచి భౌతికవాది, విజ్ఞాన సర్వస్వకర్త.

21. స్పార్టకస్ = ప్రాచీన రోమన్ సామ్రాజ్యంపై జరిగిన బానిసల తిరుగుబాటుకు నాయకుడు, బానిస.

22. కెప్లర్ (1571-1630) జర్మన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు.

మీ కతి ప్రియమైన నాయకురాలు : గ్రెషెన్[23]

మీ కతి ప్రియమైన పుష్పం : డఫ్నె

మీ కతి ప్రియమైన రంగు : ఎరుపు

మీ కతి ప్రియమైన పేరు : లారా జెన్నీ[24-25]

మీ కతి ప్రియమైన వంటకం : చేప

మీ కతి ప్రియమైన సూక్తి :మానవ లక్షణంగల దేదీ విజాతీయం కాదు.[26]

మీ కతి ప్రియమైన మూలసూత్రం : ప్రతివ్యక్తీ ప్రతి దాన్నీ శంకించాలి.[27]

# స్నేహం అంటే

ఎంగెల్స్‌తో నాకు గల సంబంధాన్ని మీరు పొరబాటుగా అర్థం చేసుకున్నారు. ఆయన నాకు అత్యంత ఆప్తమిత్రుడు. ఆయన వద్ద నేను దాచే రహస్యాలంటూ లేవు. ఆయన తోడ్పాటే నాకు లేకపోతే, నేను చాలాకాలం కిందటే ఏదోఒక "వ్యాపారం" చేబట్టేవాణ్ణి. అందుచేత, ఏ పరిస్థితుల్లోనూ ఆయనతో మూడవ వ్యక్తి నాకోసం మధ్యవర్తిత్వం నెరపడం నాకిష్టం లేదు.

- కారల్ మార్క్స్

*డాక్టర్ కూగెల్మన్‌కి[28] రాసిన ఒక జాబునుంచి (1866)*

---

23. గ్రెషెన్ = గెథె రచించిన "ఫాస్ట్" అను నాటకంలో నాయకురాలు.

24-25. లారాజెన్నీ = మార్క్స్ కుమార్తె.

26. మూలం లాటిన్ భాషలో ఉంది దానికిది స్థూలానువాదం.

27. దీని మూలం కూడా లాటిన్ భాషలోనిదే. జ్ఞాన సాధనకిది మార్గమని మార్క్స్ భావం కావచ్చు.

28. లుడ్విగ్ కూగెల్మన్ (1830-1902) జర్మన్ డాక్టరు; 1848-49 విప్లవంలో పాల్గొన్నారు; మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థలో సభ్యులు; 1864-74 మధ్య మార్క్స్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. వాటిలో జర్మనీదేశ పరిస్థితిని తెలియజేస్తూ వచ్చారు; మార్క్స్, ఎంగెల్స్‌లకు వ్యక్తిగత స్నేహితులు.

# శ్రామికవర్గం కోసం త్యాగం

నేను మీకెందుకు జవాబు రాయలేదనేగదా మీరడిగేది? నేనిన్నాళ్ళూ ఎడతెగకుండా సమాధి అంచున తారాడుతూ ఉన్నాను. అందుచేత, నా గ్రంథాన్ని[29] పూర్తిచేసేందుకు ఓపిక ఉన్నప్పుడల్లా ప్రతి నిమిషాన్నీ ఉపయోగించవలసి వచ్చేది. ఆ గ్రంథం కోసం నా ఆరోగ్యాన్నీ, సౌఖ్యాన్నీ, కుటుంబాన్నీ కూడా త్యాగం చేశాను. దీనికి యింతకన్న అదనపుదేదీ చేర్చనక్కర లేదనుకుంటాను. "అనుభవజ్ఞులు" అని పిలువబడే వారి వివేకం చూచి నేను నవ్వుకొంటూ ఉంటాను. ఒక వ్యక్తి ఎదురుగా బతకదలచుకొంటే, మానవజాతి యొక్క బాధల్ని అతడు సహజంగా పట్టించుకోడు; తన చర్మం విషయమే అతడెప్పుడూ పట్టించుకొనేది. కాని, నేను నా గ్రంథాన్ని రాతలో అయినా పూర్తిచేయక ముందు బకెట్టు తన్నేయడం నిజంగా అనుభవహీనుని లక్షణమని నేను భావిస్తున్నాను.

ఈ గ్రంథపు మొదటి సంపుటం కొద్ది వారాల్లో హాంబర్గ్‌లోని ఓటోమీస్నర్‌చే ప్రచురింపబడుతుంది. దాని శీర్షిక: "కాపిటల్: అర్థశాస్త్రంపై ఒక విమర్శ".

- కారల్ మార్క్స్

*ఎస్. మేయర్‌కి[30] రాసిన ఒక జాబు నుంచి (1867)*

29. మార్క్స్ ప్రస్తావిస్తున్నది తన "కాపిటల్" (పెట్టుబడి) అను గ్రంథాన్ని గురించి.

30. ఎస్. మేయర్ (దాదాపు 1840-72) జర్మన్, అమెరికన్ కార్మికోద్యమాల్లో పాల్గొన్నారు. మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థలో సభ్యులు; 1866లో అమెరికాకు వలస వెళ్ళారు; అక్కడ మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ శాఖలను స్థాపించారు; మార్క్స్, ఎంగెల్స్‌లకు వ్యక్తిగత స్నేహితులు, సహయోధులు.

# ఓదార్పు లక్ష్యం

ప్రియమైన ఎమిల్,

సోమవారం సాయంత్రం మన ప్రియమైన మేరీ బార్టెల్స్ స్కార్లెట్ జ్వరం వల్ల చనిపోయిందనే విషాదవార్త యిప్పుడే నాకు మామా నుంచి అందింది. ఈ వార్త నా హృదయాంతరాళాన్ని కలచివేసింది.

...నేను మిమ్మల్ని ఓదార్చడానికిది రాయడంలేదు. ఒక వ్యక్తి ఎవరినుంచి అయితే సానుభూతి పొందే హక్కు తనకున్నదని అనుకుంటాడో, వారు ఆ సానుభూతిని ప్రకటించడం వల్ల ఎంత మనశ్శాంతి కలిగేదీ నేనెరుగుదును. ఈ సానుభూతి నా హృదయం నుంచి వస్తోంది, నమ్మండి.

మేరీకీ, అభాగ్యుడైన రాబర్టుకీ, మీ పిల్లలందరికీ నా సహృదయ సానుభూతిని అందజేయండి.

మీ హృదయపూర్వక

-ఫ్రెడరిక్

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*

*ఇ. బ్లాంక్‌కి రాసిన ఒకజాబు నుంచి (1869)*

# నూతన సమాజ ఆవిర్భావం

ఇంగ్లీషు కార్మిక వర్గం ఫ్రెంచి, జర్మన్ కార్మిక ప్రజలకు తన స్నేహ హస్తాన్ని చాచుతోంది. దగ్గర పడుతున్న ఈ భయంకర యుద్ధం ఏ రూపం ధరించినా, అన్ని దేశాల కార్మిక వర్గాలు నెరపుకొనే మైత్రి చివరకు యుద్ధాల్నే అంతమొనర్చుతుందని వారు గాఢంగా నమ్ముతున్నారు. ఒక వైపు ఫ్రెంచి, జర్మన్ పాలక వర్గాలు సోదర సమరానికి ఆయత్తమవుతోంటే, రెండో వైపు ఫ్రెంచి, జర్మన్ కార్మికులు ఒకరికొకరు శాంతి సందేశా లందజేసుకుంటున్నారు; సుహృద్భావ సందేశాలు పంపుకొంటున్నారు. ఇదొక అపూర్వమైన సంఘటన; గత చరిత్రలో ఎన్నడూ జరగనిది. దీన్నిబట్టి, యిప్పటికన్న ఉజ్వలమైన భవిష్యత్తు మన ముందున్నట్లు స్పష్టమవుతుంది. అంతేకాదు. ఆర్థిక విపత్తులు, రాజకీయ సంధి ప్రలాపాలతో కొట్టు మిట్టాడుతున్న పాత ప్రపంచానికి పోటీగా ఒక కొత్త సమాజం ఉద్భవిస్తోందని యిది రుజువుచేస్తుంది. దాని అంతర్జాతీయ సూత్రం శాంతి. ఎందుచేతంటే, దాని జాతీయ పాలక వర్గం అన్ని చోట్లా ఒకటే:

శ్రామిక వర్గం:

...పారిస్‌లో కమ్యూన్ ఎంతో అద్భుతంగా మారిపోయింది! అక్కడ రెండవ సామ్రాజ్యకాలపు పారిస్‌లో లాగ, తళుకు బెళుకుల వయ్యారపు లక్షణాలేవీ యిప్పుడుకానరావు. ఇదివరకటి లాగ, అది బ్రిటిష్ భూస్వాములకు, ఐరిష్ గైర్ హాజరీలకు, అమెరికన్ మాజీ బానిస యజమానులకు, షోకిల్లాలకు, రష్యన్ మాజీ అర్ధబానిస యజమానులకు, రుమేనియన్ సామంతులకు సంకేత స్థలంగా యిప్పుడు లేదు. మైదానాల మీద గుర్తింపుకోసం పడుకోపెట్టబడే శవాలక్కడ లేవు. రాత్రి దొంగతనాలు లేవు; దోపిళ్ళు అసలే లేవు. నిజం చెప్పాలంటే, 1848 ఫిబ్రవరి రోజుల తర్వాత మొట్ట మొదటిసారిగా పారిస్ వీధులు రక్షిత వీధులయాయి. ఏ విధమైన పోలీసు గస్తీలు అక్కడ లేవు. ఒక కమ్యూన్

సభ్యుడిలా అన్నాడు: "ఫలానా చోట హత్య జరిగిందని గాని, మీదపడి కొట్టడం జరిగిందని గాని మేము వినలేదు. నిజానికి, పోలీసులు తమ కన్సర్వేటివ్ మిత్రులందరినీ తమతో బాటే వెర్సేల్స్ నగరానికీడ్చు కెళ్ళినట్లు కనిపిస్తుంది." ఇదివరలో పారిస్ నగరం పడుపు కత్తెలకు ఆటపట్టుగా ఉండేది. రహస్యంగా తమవద్దకు వచ్చే కుటుంబీకులు, మత బోధకులు, ఆస్తిపరులు వారికి పోషకులుగా వుండేవారు. అట్టి పడుపు కత్తెల స్థానంలో నిజమైన పారిస్ మహిళలు - ప్రాచీన స్త్రీలను పోలిన వీరవనితలు, ఉన్నతురాంద్రు, పతివ్రతలు - తిరిగి ఆ నగరాన్ని అలంకరిస్తున్నారు. శ్రమించే పారిస్ నగరం, యోచించే ఆ రాజధాని, పోరాడే ఆ మహా పట్టణం, రక్తం చిందించే ఆ మహాకేంద్రం తాను ప్రదర్శించిన చారిత్రక చొరవకు ఉత్సాహంతో మిలమిల మెరసిపోతోంది. తన గర్భం నుంచి ఒక నూతన సమాజం ఆవిర్భవిస్తుందనే సంతోషంతో అది పరవశం చెందియుంది. ఆ సంతోషంలో అది తన తలవాకిట నిలిచియున్న నరభక్షకుల్ని యించుమించు మరచిపోయింది.

- *కారల్ మార్క్స్*

*"ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం" నుంచి (1870)*

# అంతిమ విజయం కోసం త్యాగాలు అవసరం

...ప్రతి పార్టీనాయకత్వం సహజంగా విజయాలు సాధించాలని కోరుతుంది. అది మంచిదే. కాని, కొన్ని పరిస్థితుల్లో, తాత్కాలిక విజయాలను అంతకంటె ముఖ్యమైన వాటికోసం త్యాగం చేయగల ధైర్యాన్ని ప్రదర్శించాలి. ముఖ్యంగా, మన పార్టీ లాంటి పార్టీకి యిది చక్కగా వర్తిస్తుంది. మన పార్టీ ఉత్తరోత్తరా విజయం సాధించి తీరుతుందనడంలో సందేహం లేదు; యిది ముమ్మాటికీ జరుగుతుంది. అంతేకాక, మన పార్టీ మన జీవితకాలంలోనే, మన కళ్ళయెదుటనే ఎంతగానో అభివృద్ధి చెందింది. ఇట్టి మన పార్టీ ఎల్లప్పుడూ తాత్కాలిక విజయాలు సాధించితీరాలని లేదు; అవి ఎల్లప్పుడూ అవసరం కాకపోవచ్చు. ఉదాహరణకు, అంతర్జాతీయ కార్మిక సంస్థనే తీసుకుందాం. కమ్యూన్ అవతరించాక అది అద్భుతమైన విజయం సాధించింది. అది సర్వ శక్తివంతమైందని బూర్జువా వర్గం ఒక్కుమ్మడిగా భావించింది. అత్యధికంగా ఉన్న సాధారణ సభ్యులు ఆ పరిస్థితి అలాగే శాశ్వతంగా ఉంటుందని విశ్వసించారు. కాని, ఆ నీటి బుగ్గ పగిలిపోక తప్పదని మనం ఎరుగుదుం. నకిలీ సరుకంతా దానికి అంటిపెట్టుకుపోయారు. అందులోని సెక్టేరియన్లు పొగరుబోతులై, అంతర్జాతీయ కార్మిక సంస్థను దుర్వినియోగ పరచుకున్నారు. తమ అతినీచమైన, అతి మూర్ఖమైన పనులన్నీ అనుమతింప బడతాయని వారాశించారు. కాని, మనం వాటి ననుమతించ లేదు. ఎప్పుడో ఒకప్పుడు బుగ్గ పగిలిపోకతప్పదని బాగా ఎరుగున్న మనం, ఇక ఏ మాత్రం ఆలస్యం చేయదలచుకోలేదు, దాన్నుంచి అంతర్జాతీయ కార్మిక సంస్థ స్వచ్ఛమైనదిగా, నిష్కల్మషమైనదిగా ఉద్భవించేటట్లు మనం

చేయదలచుకున్నాం. చివరకు, ఆ బుగ్గ హేగ్[31] లో బద్దలయింది. దానికి హాజరైన అధిక సంఖ్యాక సభ్యులు నిరాశతో కృశించి, ఎవరి యిళ్ళకు వారు తిరిగి వెళ్ళారు. ఇది మీకు తెలుసు. హతాశులైన వీరందరు, అంతర్జాతీయ కార్మిక సంస్థలో సార్వత్రిక సోదరత్వాన్నీ, సర్వ సమన్వయాన్నీ దర్శించగల మనుకున్నారు. కాని, వారాశాభంగం పొందారు. హేగ్‌లో కంటే కూడా కఠినమైన ఘర్షణలను వారు తమ సొంత దేశాల్లో ఎదుర్కొనవలసి వచ్చింది. ఇప్పటీ సెక్టేరియన్ పేచీకోరులు రాజీమార్గం బోధిస్తూ, మనమే పేచీ కోరులమనీ, నియంతలమనీ అభాండాలు వేస్తున్నారు. హేగ్‌లో మనం సమన్వయ మార్గమవలంబించి ఉంటే, చీలిక తప్పదనే విషయాన్ని మనం దాచి ఉంచినట్లయితే, ఏమి జరిగి యుండేది? సెక్టేరియన్లు, ముఖ్యంగా బకునిన్[32] అనుయాయులు, అంతర్జాతీయ కార్మిక సంస్థ పేరుతో మరింత మూర్ఖమైన, సిగ్గుమాలిన పనులు చేసేందుకు మరో సంవత్సరం వ్యవధి లభించేది. అత్యంత అభివృద్ధికర దేశాల కార్మికులు విసుగెత్తి వెళ్ళి పోయేవారు. బుగ్గ పగలిపోయేది కాదు గాని, సూదుల వల్ల ఏర్పడే కన్నాల వల్ల చప్పబడిపోయి, నెమ్మదిగా నశించి యుండేది. మరుసటి మహాసభ ఎలాగూ సంక్షోభంలో యిరుక్కు తీరేదే గనుక అది అతిహేయమైన వ్యక్తిగత దూషణల సభగా మారి ఉండేది; ఎందుచేతంటే, సిద్ధాంతాలదివరకే హేగ్‌లో త్యజింపబడేవి గనుక. అప్పుడు అంతర్జాతీయ కార్మిక మహాసభ ముక్క చెక్కలయేది. "ఐక్యత" ద్వారా అది ముక్క చెక్కలయేది. దానికి బదులు, మనమీరోజున పుచ్చు సరుకునంతా విసిరి పారవేసి గౌరవంగా బయటపడ్డాం. చివరిదైన, నిర్ణాయకమైన ఆ మహాసభకు హాజరైన కమ్యూన్ సభ్యులు చెబుతున్నదేమంటే, అదివరకటి ఏ మహాసభా తమపై అంత దృఢమైన ప్రభావం కలుగజేయ లేదని; యూరపియన్ కార్మిక వర్గానికి ద్రోహం తలపెట్టిన వారిపై అది తీర్పు చెప్పిందని. వారు అబద్ధాలు చెప్పీ, నిందలు ప్రచారం చేసీ, కుట్రలు

31. మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ యొక్క ఐదవ మహాసభ 1872 సెప్టెంబరు 2-7 తేదీల మధ్య హేగ్‌లో (నెదర్లాండ్స్) జరిగింది. ఆ మహాసభలో మార్క్సిజం పెట్టీ బూర్జువా, సెక్టేరియన్ సోషలిస్టు రూపాలపై సిద్ధాంతరంగంలోను, నిర్మాణ రంగంలోను పూర్తి విజయాన్ని సాధించింది.

32. మైకేల్ అలెగ్జాండ్రొవిచ్ బకునిన్ (1814-76) రష్యన్ అరాచకవాది.

జరిపి పదినెలలు తమ శక్తినంతా వినియోగించ నిచ్చాం. వారంతా యిప్పుడెక్కడున్నారు? అంతర్జాతీయ కార్మిక సంస్థలో తాము అత్యధిక సంఖ్యాకులమని చెప్పుకుంటూ వచ్చిన ఆ హేమా హేమీలంతా, మరుసటి మహాసభకు హాజరయే ధైర్యం తమకులేదని యిప్పుడు స్వయంగా చెప్పుకొంటున్నారు. (ఈ జాబుతోపాటు "వోక్ స్టాట్" పత్రికకు పంపుతున్న ఒక వ్యాసంలో నేనింకా ఎక్కువ వివరాలిచ్చాను.) మళ్ళీ మనం యిలాగే చేయవలసివస్తే, దీన్ని మొత్తంగా చూచినప్పుడు, మరొకలా మనం చేయకూడదు. అయితే, ఎత్తుగడల విషయంలో ఎప్పుడైనా పోరబాట్లు జరగ వచ్చుననేది ఉండనే ఉంది....

... అంతేకాక, వృద్ధుడైన హెగెల్ చాలాకాలం కిందటే చెప్పారు. ఏదైనా ఒక పార్టీ చీలిపోయినా, ఆ చీలికకు అది తట్టుకోగల్గితే, విజయం సాధించగల్గుతుందని. శ్రామిక వర్గ ఉద్యమం తప్పనిసరిగా వేర్వేరు అభివృద్ధి దశల్ని దాటుతుంది. ప్రతిదశలోనూ కొందరు ఉన్నచోటనే ఉండిపోయి, యితరులతో కలిసి పురోగమించరు....

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*

*ఎ. బెబెల్‌కి[33] రాసిన ఒక జాబునుంచి (1873)*

# కారల్ మార్క్స్

## ఎఫ్. సోర్జ్‌కి[34] రాసిన ఒక జాబునుంచి (1874)

...నేను తిరిగి వచ్చాక మళ్ళీ పూర్తిగా పని చేయగలనని వారు[35] హామీ ఇస్తున్నారు. పశువుకాని ఏ మనిషైనా, పని చేయలేక పోవడం నిజంగా ఉరిశిక్షే....

33. ఆగస్ట్ బెబెల్ (1840-1913) అంతర్జాతీయ కార్
జర్మన్ కార్మికోద్యమంలోను పాల్గొన్న ప్రముఖ వ్యక్తి; వృతిరీత్యా టర్నరు; మొదట అంతర్జాతీయ కార్మిక సంస్థలో సభ్యుడు; జర్మన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ స్థాపకుల్లో ఒకరు; మార్క్స్, ఎంగెల్స్‌ల సహయోధుడు, వ్యక్తిగత మిత్రుడు.

34. ఫ్రెడిరిక్ ఎడాల్ఫ్ సోర్జ్ (1828-1908) అంతర్జాతీయ కార్మికోద్యమంలోను, అమెరికన్ కార్మికోద్యమంలోను, సోషలిస్టు ఉద్యమంలోను పాల్గొన్న ప్రముఖ వ్యక్తి. 1848 విప్లవంలో కూడా పాల్గొన్నారు; అక్కడ అంతర్జాతీయ కార్మిక సంస్థయొక్క శాఖల్ని నిర్మించారు; మార్క్సిజాన్ని చురుగ్గా ప్రచారం చేశారు; మార్క్స్, ఎంగెల్స్‌ల సహయోధులు, వ్యక్తిగత మిత్రులు.

35. కారల్ మార్క్స్ డాక్టర్ల సలహామీద కారల్స్‌బాద్‌లో చికిత్స పొందవలసి వచ్చింది.

# న్యాయం కోసం సాయం

ప్రియమిత్రమా,

పార్టీకి గొప్ప సేవచేసిన ఒక రష్యన్ వనిత, ద్రవ్యం లేనందున, మాస్కోలో ఉన్న తన భర్తకోసం వకీలును నియమించుకో లేకుండా ఉన్నారు. ఆమె భర్తను గురించి నాకేమీ తెలియదు; ఆయన నేరస్తుడో కాదో కూడా తెలియదు. కాని, విచారణ అనంతరం ఆయన సైబీరియాకు పంపబడవచ్చు; తన భర్త నిర్దోషి అని... సతి[36] నమ్ముతుండడంవల్ల. తానుకూడా సైబీరియాకు వెళ్ళాలని ఆమె నిశ్చయించుకున్నారు, అందువల్ల ఆమె భర్త తరపున వాదించడానికి ఏ లాయరునైనా చూచి, ఆ విధంగా ఆమెకు తోడ్పడ్డం ఎంతైనా ముఖ్యం. అసలు విషయమేమంటే, యింతవరకు ఆమె వ్యవహారాలన్నిటినీ ఆమె భర్త చూస్తూ వచ్చారు; అవి యిప్పుడు ఏ స్థితిలో ఉన్నాయో ఆమెకు తెలియదు; కాబట్టి లాయరు మాత్రమే ఆమెకు తోడ్పడగలరు.

తనయేవ్‌గారిని మీరెరుగుదురు కదా... ఆయన ప్రజా విముక్తి ఆశయాన్ని విశ్వాసపాత్రంగా బలపరచే వ్యక్తిగనుక, ఆయనంటే నాకు చిరకాలంగా గాఢాభిమానం ఉంది. ఇలాంటి ప్రతిఫల రహితమైన పని చేయగల వ్యక్తి మాస్కోలో బహుశా వీరొక్కరేననుకుంటాను. అందుచేత, అతికష్ట పరిస్థితుల్లో వున్న మన మిత్రురాలిపట్ల దయచూపవలసిందిగా మీరు ఆయనను నా తరపున అర్థించగలిగితే, నేను మీకు ఋణపడి యుంటాను.

ఇట్లు, మీ...

- *కారల్ మార్క్స్*

*ఎం. ఎం కొవలెవ్‌స్కీకి[37] రాసిన జాబు (1877)*

---

36. ఎలిజబెతాలుకి నిష్నొతొమనోవ్‌స్కయా - రష్యన్ విప్లవకారిణి; స్విట్జర్లండ్‌లో మొదటి అంతర్జాతీయ కార్మిక సంస్థ యొక్క రష్యన్ విభాగంలో సభ్యురాలు; పారిస్ కమ్యూన్‌లో చురుగ్గా పాల్గొన్నారు.

37. మాక్సిమ్ మాక్సిమోవిచ్ కొవలెవ్‌స్కీ - రష్యన్ చరిత్ర రచయిత! మార్క్సుకి "పండిత మిత్రుడు".

# వ్యక్తి పూజ నిరసన

...నేను ఏవిధమైన వ్యక్తి పూజ సిద్ధాంతాన్నీ సహించేవాణ్ణికాను గనుక, అంతర్జాతీయ కార్మిక సంస్థ పనిచేస్తున్న కాలంలో నన్ను ప్రశంసిస్తూ వివిధ దేశాలనుంచి ప్రకటిత లేఖల రూపంలో వచ్చే అనేక జాబులు నన్ను గంగవెర్రు లెత్తించేవి. వాటికి నేను జవాబులు రాసేవాణ్ణి కాను; అప్పుడప్పుడు మాత్రం మందలిస్తూ ఉండేవాణ్ణి. ఎంగెల్సూ, నేనూ మొట్టమొదట కమ్యూనిస్టు సొసైటీ అను రహస్య సంస్థలో చేరినప్పుడు మేమొక షరతు విధించాం. అదేమంటే, అధికార పదవిపట్ల మూఢ విశ్వాసాన్ని ప్రోత్సహించే వాటన్నిటినీ నిబంధనావళినుంచి తొలగించి వేయాలని....

*- కారల్ మార్క్స్*

*డబ్ల్యు. బ్లాస్‌కి[38] రాసిన ఒక జాబు నుంచి (1877)*

38. విల్హెల్మ్ బ్లాస్ (1849-1927) జర్మన్ సోషల్ డెమాక్రాట్ జర్నలిస్టు, చరిత్ర రచయిత; తర్వాత సోషల్ ఛావినిస్టు (సోషలిస్టునని చెప్పుకొనే జాతీయ దురహంకారి) అయ్యారు.

# నీతి ఆవిర్భావ వికాస విశ్లేషణ

...మంచి చెడుల్ని గురించిన అభిప్రాయాలు దేశ దేశానికీ, యుగ యుగానికీ ఎంతగా భేదిస్తాయంటే, అవి తరచు ఒకదాని కొకటి వ్యతిరేకంగా కూడ ఉంటాయి.

అయినప్పటికీ, మంచి అనేది చెడుకాదు, చెడు అనేది మంచి కాదని కొందరు అభ్యంతరం చెబుతారు. మంచీ చెడూ ఒకటేననుకుంటే, నీతి అనేది నశిస్తుందనీ, ప్రతివ్యక్తీ తన యిష్టం వచ్చినట్లు చేయవచ్చుననీ వారు వాదిస్తారు. డూరింగ్ అభిప్రాయం కూడా అదే. అయితే, ఆయన దైవ సూక్తుల్లాగ కనిపించే శబ్ద జాలాన్ని ఉపయోగిస్తారు. దాన్ని మనం తొలగించి చూడాలి. కాని, ఈ విషయాన్ని మనం అంత సులభంగా కొట్టి పారవేయలేం. అలా చేస్తే, మంచి చెడుల్ని గురించిన తగాదాయే ఉండదు; మంచినీ, చెడునీ అందరూ తెలుసుకోగల్గుతారు. అయితే, యీనాటి పరిస్థితి ఏమిటి? ఈ రోజున ఏవిధమైన నీతి బోధింపబడుతోంది? మొదటిది క్రైస్తవ - ఫ్యూడల్ నీతి. ఇది పూర్వపు మత సాంప్రదాయం నుంచీ ఆనువంశికంగా వ్యాప్తిలో ఉంది. దీన్ని ప్రధానంగా కేథలిక్ నీతి అనీ, ప్రొటెస్టెంట్ నీతి అనీ రెండు విధాలుగా విభజించవచ్చు. ఈ రెంటినీ అనేక ఉపశాఖలుగా కూడ విడదీయవచ్చు. అవి జె సూయిట్ కేథలిక్ నీతి, సనాతన ప్రొటెస్టెంట్ నీతి లగాయతు కేవలం “ఉన్నత తరగతి” నీతివరకు విస్తరించి యున్నాయి. వీటన్నిటి సరసన ఆధునిక బూర్జువా నీతిని కూడా మనం చూస్తున్నాం. దాని సరసన, భవిష్యత్తులో వ్యాప్తిచెందే శ్రామిక నీతికూడా కనిపిస్తుంది. ఈ విధంగా అత్యంత అభివృద్ధికర యూరపియన్ దేశాల్లో భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలకు చెందిన నీతి సూత్రాలు ఏకకాలంలో ఒకదాని సరసన ఒకటి వ్యాప్తిలో ఉన్నట్లు మనం చూస్తాం. అలాంటప్పుడు ఏది సరియైన నీతి - అనే ప్రశ్న ఉదయిస్తుంది. దీనికి జవాబు ఒక్కటే: ఏదీ సంపూర్ణ సత్యం కాదు, అంతిమంగా. కాని, ఒకటి మాత్రం ఖచ్చితం. అదేమనగా, ఏ నీతి ఐతే వర్తమానంలోనే వర్తమానపు విధ్వంసాన్నీ,

భవిష్యత్తు ఆవిర్భావాన్ని చూపుతుందో, అందులోనే శాశ్వత లక్షణాలుగా ఉండిపోయేవి గరిష్ట ప్రమాణంలో ఉంటాయి. అదే శ్రామికవర్గ నీతి.

అయితే, ఆధునిక సమాజంలోని మూడు వర్గాలకూ - ఫ్యూడల్ భూస్వామ్య, బూర్జువా, శ్రామిక వర్గాలు - దేని నీతి దానికుంటుందని ఎప్పుడైతే మనం గమనిస్తామో, అప్పుడు మనమొక నిర్ధారణకు వస్తాం. అదేమంటే, మానవులందరి మధ్య కొన్ని స్పష్టమైన క్రియాత్మక సంబంధాలేర్పడి యుంటాయి; వాటి మీదనే వారి వారి వర్గ స్థితి ఆధారపడి యుంటుంది. అంటే, ఉత్పత్తికీ మార్పిడికీ సంబంధించిన ఆర్థిక సంబంధాలమీద అది ఆధారపడి యుంటుందన్నమాట. ఈ ఉత్పత్తి సంబంధాల నుంచే వారు, అంత్య పరిశీలనలో, తమ నైతిక భావాలను ఏర్పరచుకుంటారు, తమకు తెలిసిగాని తెలియకగాని.

అయితే, పైన పేర్కొన్న మూడు విధాలైన నైతిక సిద్ధాంతాల్లో సమానాంశ చాలా ఉంది. అది, సర్వకాల సర్వావస్థల్లోనూ స్థిరంగా నిలిచే ఒక నీతిలో కనీసం ఒక భాగం కాదా? ఈ నైతిక సిద్ధాంతాలు ఒకే చారిత్రకాభివృద్ధి యొక్క మూడు దశలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అందుచేత, వాటి చారిత్రక పూర్వరంగం సమానమైనట్టిది. అందుచేతనే, వాటిలో సమానాంశ చాలా ఉంటుంది. అంతేకాదు. ఆర్థికాభివృద్ధి యొక్క సరిపోల్చదగ్గ దశల్లో, లేదా యించుమించు సరిపోల్చదగ్గ దశల్లో, నైతిక సిద్ధాంతాలు తప్పనిసరిగా ఏకత్వాన్ని కలిగి యుంటాయి. చరాస్తిపై సొంత యాజమాన్యం వృద్ధిచెందిన క్షణంనుంచీ, అట్టి సమాజాలన్నిటిలో ఒకే విధమైన నైతిక నిబంధన అమల్లో ఉంటూ వచ్చింది. అది, నీ వెప్పుడూ దొంగతనం చేయవద్దని. అంత మాత్రాన అదొక శాశ్వత నైతిక నిబంధనగా ఉండిపోవలసిందేనా? ఎన్నటికీ కాదు. దొంగతనం చేయడానికి గల కారణాలు కొన్ని సమాజాల్లో నిర్మూలింపబడవచ్చు. అప్పుడెవరైనా దొంగతనం చేస్తే, వారు ఉన్మాదులై యుంటారు. అట్టి సమాజాల్లో, ఏ మతబోధకుడైనా, నీ వెప్పుడూ దొంగతనం చేయవద్దని బోధించ యత్నిస్తే, అతన్ని చూచి అందరూ నవ్వుకోకుండా ఉండరు.

అందుచేత, ఎవరైనా నైతిక రంగంలోకూడ శాశ్వత సిద్ధాంతాలుంటాయనీ, అవి చరిత్రకూ దేశ వ్యత్యాసాలకూ అతీతమైనవనీ, సాకు చూపి, ఏదైనా ఒక నిబంధనను శాశ్వత నిబంధనగా, అంతిమ నిబంధనగా,

మారని దానినిగా మన మీద రుద్ద ప్రయత్నిస్తే, అట్టి ప్రతి ప్రయత్నాన్నీ మనం వ్యతిరేకిస్తాం. గతంలో సమస్త నైతిక సిద్ధాంతాలు, అంత్య పరిశీలనలో, ఆయా కాలాల్లో ప్రచలితమైయున్న ఆర్థిక పరిస్థితుల నుంచి ఉత్పన్నమైనవేనని మనం నిరూపిస్తాం. గతంలో సమాజం వర్గ వైషమ్యాల ద్వారా వృద్ధిచెందినందున, నీతి ఎల్లప్పుడూ వర్గ నీతిగానే ఉంటూ వచ్చింది. అది పాలకవర్గ ప్రయోజనాల్నీ, పెత్తనాన్నీ సమర్థించడమైనా చేసింది; లేదా పీడిత వర్గం తగినంత శక్తిని పుంజుకొన్నప్పటి నుంచీ ఆ పెత్తనంపట్ల పీడితవర్గ ఆగ్రహాన్నీ, ఆ వర్గ భవిష్యత్ప్రయోజనాల్నీ ప్రకటించడమైనా చేసింది. ఈ క్రమంలో, మొత్తంమీద, మిగతా జ్ఞాన రంగాలన్నిటిలాగే నీతికూడా అభివృద్ధి చెందిందనడంలో సందేహంలేదు. కాని, మనమింకా వర్గనీతిని అధిగమించలేదు. సమాజం ఏ దశలో వర్గ వైషమ్యాలను అధిగమిస్తుందో, దానితోబాటు ఏ దశలో వాటిని నిత్యజీవితంలో మరచిపోతుందో, ఆ దశలో మాత్రమే నిజమైన మానవ నీతి, వర్గ వైషమ్యాల కతీతమైనట్టిది, వాటి జ్ఞాపకాల కతీతమైనట్టిది సాధ్యపడుతుంది.

...సమాజం భవిష్యత్తులో ఉత్పత్తి సాధనాలన్నిటినీ ఒక సామాజిక పథకం ప్రకారం ఉపయోగించేటందుకై వాటిని స్వాయత్తం చేసుకొంటుంది; తద్వారా, మానవులు తమ ఉత్పత్తి శక్తులకు తామే బానిసలయే స్థితిని అంతమొందిస్తుంది. దీన్నిబట్టి స్పష్టమయేదేమంటే, సమాజం ప్రతి వ్యక్తినీ విముక్తి చేయనిదే తన్ను తాను విముక్తి చేసుకోలేదు. అందుచేత, పాత ఉత్పత్తి విధానాన్ని పై నుంచి కిందివరకు విప్లవాత్మకంగా మార్చివేయాలి; ముఖ్యంగా, యిదివరకటి శ్రమ విభజనను రద్దుచేయాలి. దాని స్థానంలో మరో కొత్త ఉత్పత్తి వ్యవస్థ ఏర్పడాలి. ఆ వ్యవస్థలో, ఏ వ్యక్తీ ఉత్పాదక శ్రమలో తన వాటాకు వచ్చిన దానిని యితరుల భుజాలమీద మోపకూడదు. ఇది మానవుని అస్తిత్వానికి సహజ లక్షణం. రెండవ దేమంటే, ఉత్పాదక శ్రమ మానవుల్ని లోబరచుకోడానికొక సాధనంగాకాక, వారి విముక్తికొక సాధనంగా ఉపయోగపడుతుంది. ఇది ఎలా సాధ్యమంటే, ప్రతివ్యక్తీ తన శారీరక, మానసిక శక్తుల్ని అన్నిదిశల్లో అభివృద్ధి చేసుకొనేందుకు, పూర్తిగా వాటిని ఉపయోగించుకొనేటందుకు అది అవకాశమిస్తుంది. అందువల్ల, ఉత్పాదక శ్రమ మానవునికి భారంగా ఉండక, ఆనందాన్నిచ్చేదిగా ఉంటుంది.

...మతం విషయం చూద్దాం. మానవుల నిత్యజీవితాన్ని అదుపులో పెట్టే బాహ్యశక్తులు వారి మనస్సులలో ఊహలుగా ప్రతిబింబిస్తాయి. మతం అంటే ఆ ప్రతిబింబాల సమాహారం తప్ప మరొకటి కాదు. మతంలో ఐహిక శక్తులు మానవాతీత శక్తుల రూపం ధరిస్తాయి. చరిత్ర తొలి దశలో అలా ప్రతిబింబించినవి ప్రకృతిశక్తులు. తర్వాత, ముందడుగిడిన పరిణామ క్రమంలో, అవి వివిధ జాతుల ప్రజల్లో అసంఖ్యాకమైన, రకరకాలైన మానవ రూపాలు ధరించాయి. ప్రాచీన గాథా సంప్రదాయాల పోలికలను పరిశీలిస్తే, కనీసం ఇండో యూరపియన్ జాతుల విషయంలో యీ తొలి పరిణామ క్రమం మనకు గోచరిస్తుంది. ముఖ్యంగా, భారతదేశపు వేదాల్లో యిది గోచరిస్తుంది. ఇంకా ముందుకుపోతే, అది భారతీయుల్లోను, పర్షియన్లలోను, గ్రీకుల్లోను, రోమన్లలోను, జర్మన్లలోను, ఆధారాలు లభించినంతవరకు కెల్టులలోను, లిథుయేనియన్లలోను, స్లావ్‌లలోను యింకా వివరంగా ద్యోతకమవుతుంది. కాని, త్వరలోనే ప్రకృతి శక్తుల సరసన సామాజిక శక్తులు కూడ చురుగ్గా పనిచేయసాగాయి. ఇవి మానవుని ముందు ప్రకృతి శక్తులంత అన్యశక్తులుగానూ నిలబడ్డాయి. మొదట్లో అవి ప్రకృతి శక్తులంత అనిర్వచనీయంగా ఉండేవి; వాటితో సమానంగా అవి మానవునిపై పెత్తనం చేయసాగాయి. ఆ పెత్తనం పైకెంతో సహజ సిద్ధమైన ఆవశ్యకతగా కనబడేది. తొలిదశలో నిగూఢమైన ప్రకృతి శక్తుల్ని మాత్రమే, ప్రతిబింబించిన మార్మిక, దురవగాహమూర్తులు యీ దశలో సామాజిక లక్షణాలను సంతరించుకొన్నాయి; అవి చారిత్రక శక్తుల ప్రతినిధులుగా తయారయాయి. ఇంకా ఉన్నతమైన పరిణామ దశలో, అసంఖ్యాక దేవతల ప్రకృతి లక్షణాలూ, సామాజిక లక్షణాలూ సర్వశక్తులతో అలరారే ఏకేశ్వరునికి బదలాయింపయాయి. అతడు అనిర్దిష్ట మానవుని ప్రతిబింబం మాత్రమే. ఏకేశ్వర భావం ఉద్భవించింది యిలాగే. చారిత్రకంగా చూస్తే, యిది గ్రీకుల్లో తర్వాతివారు సృష్టించిన చిట్టచివరి నకిలీ తత్వశాస్త్రం. ఇది యూదుల ప్రత్యేక జాతీయ దైవమైన జిహోవాగా అవతరించింది. మానవులు అన్యశక్తులైన ప్రకృతి శక్తుల, సామాజిక శక్తుల అధీనంలో ఉన్నంతకాలం, మతం సుకరమైన, సులభమైన, అనువైన యీ రూపంలో కొనసాగగలదు. వారిపై పెత్తనం చేసే ఆ శక్తులతో వారికి గల తక్షణ సంబంధం, అనగా ఊహాత్మక సంబంధం,

ఆ రూపంలో కొనసాగగలదు. అనగా, మతం ఏకేశ్వర భావంగా కొనసాగుతుందన్నమాట. అయితే, యిప్పుడున్న బూర్జువా సమాజంలో మానవులు తాము సృష్టించుకున్న ఆర్థిక పరిస్థితులకు తామే లోబడి పోతున్నారనీ, వారు నిర్మించుకొన్న ఉత్పత్తి సాధనాలు వారినే లోబరచు కొన్నాయనీ (అన్యశక్తి మాదిరిగా) మనం పదే పదే తెలుసుకుంటూ వచ్చాం. అందుచేత, మతం ఏ బింబీకృత క్రమంనుంచి ఉద్భవిస్తుందో, ఆ ప్రాతిపదిక ఇప్పటికీ యథాప్రకారంగానే ఉంది; దానితోబాటు మతైక ప్రతిబింబంకూడా యథాప్రకారంగానే ఉంది. ఈ అన్యశక్తుల ఆధిపత్యానికిగల కారణాన్ని బూర్జువా అర్థశాస్త్రం కొంతలోతుగా పరిశీలించినప్పటికీ, ప్రధానమైన వ్యత్యాసమేమీలేదు. బూర్జువా అర్థశాస్త్రం సాధారణ సంక్షోభాల్ని నివారించనూలేదు, వ్యక్తిగత పెట్టుబడిదారుల్ని నష్టాలనుంచీ అక్రమరుణాలనుంచీ, దివాళాలనుంచీ కాపాడనూలేదు. అలాగే, వ్యక్తిగత కార్మికుల్ని అది నిరుద్యోగం నుంచీ, దారిద్ర్యంనుంచీ రక్షించలేదు. మానవుడు తలచుకుంటే, దేవుడు (అనగా, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం అన్యశక్తిగా చెలాయించే ఆధిపత్యం) అనుగ్రహిస్తాడనే సూక్తి ఇప్పటికీ నిజమే. సామాజిక శక్తుల్ని సమాజం ఆధీనం కిందికి తేవడానికి ఒక్కటే చాలదు; ఆ జ్ఞానం బూర్జువా అర్థశాస్త్రం యిచ్చిన దానికంటే గొప్పదీ, గాఢమైనదీ కావచ్చు. అందుకు అన్నిటికంటె ముఖ్యంగా సామాజిక చర్య అవసరం. ఎప్పుడైతే ఆ చర్య కొనసాగుతుందో, సమాజం ఎప్పుడైతే ఉత్పత్తి సాధనాలన్నిటినీ స్వాధీనం చేసుకొని, ప్రణాళికా బద్ధంగా వాటిని ఉపయోగించుకొని, తద్వారా తన్నుతానూ ఇతరులందర్నీ విముక్తి చేస్తుందో, ఆ విధంగా మానవుడు ఎప్పుడైతే తలచుకొన్నదానిని అందుకుంటాడో - అప్పుడు మతంలో యిప్పటికీ ప్రతిబింబించే ఆఖరి అన్యశక్తి అంతమవుతుంది. దానితోబాటు మతైక ప్రతిబింబం కూడా అంతమవుతుంది. ఎందుచేతంటే, అప్పుడిక ప్రతిబింబింపబడేది ఏదీ ఉండదు.

- *ఫ్రెడరిక్ ఎంగెల్స్*

***"ఆంటీ డూరింగ్"[39] నుంచి (1876-78)***

39. డూరింగ్ అనే జర్మన్ పెటీ బూర్జువా సిద్ధాంతవేత్త; బెర్లిన్ యూనివర్సిటీలో లెక్చరరు. ఆయన యొక్క సిద్ధాంతాల్ని ఖండించే గ్రంథం "ఆంటీ డూరింగ్".

# పోరాట బలం

...కార్మికుల పోరాటమొక్కటే అద్భుతంగా సాగుతోంది. అదొక్కటే నేటి పరిస్థితులకు అనుగుణమైనట్టిది. పోరాటంలో పాల్గొనే వారిని బలహీన మొనర్చనిదీ, పైగా ఎప్పటికప్పుడు నూతన శక్తిని యిచ్చేదీ కూడా అదే...

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*ఎ. బెర్న్‌స్టీన్‌కి రాసిన ఒక లేఖ నుంచి (1882)*

# ఆజన్మ విప్లవకారుడు

...అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమంటే, మార్క్సు ఒక విప్లవకారుడు. జీవితంలో ఆయన ధ్యేయం పెట్టుబడిదారీ సమాజాన్నీ, అది సృష్టించిన రాజ్యాంగ సంస్థల్నీ ఏదో ఒక విధంగా కూలదోయడం; ఆధునిక కార్మికవర్గ విముక్తికి దోహదం చేయడం. కార్మికవర్గం తన స్థానాన్నీ, తన అవసరాల్నీ, తన విమోచన కవసరమైన పరిస్థితుల్నీ అర్థం చేసుకొనేటట్లు చేసిన మొట్టమొదటి వ్యక్తి ఆయనే. పోరాటం ఆయన ప్రాణం. దాన్ని మరెవ్వరూ సాగించనంతటి ఉద్వేగంతో, దీక్షతో విజయవంతంగా ఆయన సాగించారు...

...ఫలితమేమంటే, ఆయన కాలంలో అందరికంటే ఎక్కువగా ద్వేషించబడిన వ్యక్తీ, దూషించబడిన వ్యక్తీ మార్క్సు మాత్రమే. వివిధ ప్రభుత్వాలు - నిరంకుశ రాచరికాలు, రిపబ్లికన్ ప్రభుత్వాలు కూడ - ఆయనను తమ దేశాలనుంచి వెళ్ళగొట్టాయి. పెట్టుబడిదారీ వర్గాలు - యధాతథ స్వభావంగలవి, అత్యంత ప్రజాస్వామ్యయుతమైనవి - ఆయన మీద అపవాదులు కురిపించడంలో ఒకదానితో ఒకటి పోటీపడ్డాయి.

వీటన్నిటినీ ఆయన బూజు దులుపుకున్నట్లు దులిపివేసుకున్నారు; వీటినాయన లక్ష్యపెట్టలేదు. తప్పనిసరి అయితేనే వీటికాయన జవాబులు చెప్పేవారు. సైబీరియా గనులు లగాయతు కాలిఫోర్నియా వరకు, యూరపు అమెరికాల్లోని అన్ని ప్రాంతాల్లో నివసించే లక్షలాది తోటి విప్లవ కార్మికులచే ఆయన ప్రేమింపబడ్డారు; గౌరవింపబడ్డారు; చివరకు వారందరినీ దుఃఖసముద్రంలో ముంచి వెళ్ళిపోయారు. ఆయనకు వ్యతిరేకులనేకమంది ఉండవచ్చు; కాని వ్యక్తిగత శత్రువు లెవరూ ఆయనకు లేరని ధైర్యంగా నేను చెప్పగలను. ఆయన పేరు యుగయుగాల్లో నిలిచిపోతుంది; ఆయన కృషి కూడా అలాంటిదే!

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*
*కారల్‌మార్క్స్ సమాధి వద్ద యిచ్చిన ఉపన్యాసం నుంచి (1883)*

# ఆర్థికమే ప్రేమను శాసిస్తోంది

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానమూ, అది సృష్టించిన ఆస్తి సంబంధాలూ రద్దయిననాడు, తన జీవిత భాగస్వామిని ఎంచుకోడంలో యింకా బలమైన ప్రభావం కలుగజేస్తున్న ఆర్థికపరమైన ఆలోచనలు (యివి ద్వితీయ స్థాన మాక్రమించవలసింది) వ్యక్తిలో అదృశ్యమవుతాయి. అప్పుడిక అన్యోన్య వాత్సల్యం తప్ప మరో ఆలోచనే ఉండదు...

...స్త్రీ పట్ల పురుషుని విశ్వాసరాహిత్యం నేడొక అలవాటుగా ఉంటోంది. ఈ పరిస్థితిని సహించడం తప్ప స్త్రీకి గత్యంతరం లేదు. ఇందుకు కారణం ఆర్థికపరమైన ఆలోచన; అంతకంటె ముఖ్యంగా, బిడ్డల భవిష్యత్తును గురించిన ఆలోచన. ఆర్థికపరమైన ఆలోచన అదృశ్యమైననాడు, స్త్రీ పురుషునితో సమానురాలవుతుంది. మనం గత అనుభవాన్నంతనూ దృష్టిలో ఉంచుకొంటే, ఆవిధంగా ఆమె సంపాదించుకొనే సమానత్వం వల్ల స్త్రీ పొందే బహుభర్తృత్వం కంటే పురుషుడు పొందే ఏక పత్నీత్వం ఎక్కువ ఫలప్రదమవుతుంది.

అయితే, ఏకపత్నీత్వపు లక్షణాలు కొన్ని ఖచ్చితంగా అదృశ్యమవుతాయి. ఏకపత్నీత్వం ఆస్తి సంబంధాలనుంచి ఉత్పన్నమవడం వల్ల సంక్రమించిన లక్షణాలవి. వాటిలో ఒకటి పురుషుని ఆధిపత్యం; రెండు వివాహపు అభేద్యత్వం. పురుషుని ఆధిపత్యం అతని ఆర్థిక ఆధిపత్యం నుంచి ఉద్భవించింది. అందుచేత, ఆర్థిక ఆధిపత్యం ఎప్పుడైతే మాయమవుతుందో, అప్పుడు పురుష ఆధిపత్యంకూడ మాయమవుతుంది. రెండవదైన వివాహపు అభేద్యత్వం రెండు కారణాలవల్ల ఉత్పన్నమైంది. ఒకటి, ఆర్థిక పరిస్థితులు. వీటినుంచే ఏకపత్నీత్వం ఉద్భవించింది. రెండు, ఆర్థిక పరిస్థితులకూ, ఏకపత్నీత్వానికీ గల సంబంధాన్ని ప్రజలింకా సరిగా అర్థంచేసుకోనందునా, మతం దాన్ని గోరంతలు కొండంతలుచేసి చెప్పడంవల్లా ఏర్పడ్డ సాంప్రదాయం. అది యీరోజున వేయిరెట్లు అధికంగా ఉల్లంఘింపబడుతోంది. ప్రేమ మీద ఆధారపడ్డ వివాహాలే నైతికమైనవయితే, ఏ వివాహాల్లో ప్రేమ నిరంతరం నిలిచి యుంటుందో అవే నైతికమైనవవుతాయి. స్త్రీ పురుషుల మధ్య వ్యక్తిగత ప్రేమ ఎంతకాలం నిలుస్తుందనేది ఆ వ్యక్తులను బట్టి వుంటుంది- ముఖ్యంగా పురుషుల్లో. ఆ ప్రేమ ఖచ్చితంగా అదృశ్యమైనప్పుడు, లేదా దాని స్థానాన్ని ఒక కొత్త ఉద్వేగపూరితమైన ప్రేమ ఆక్రమించినప్పుడు, ఒకరినుంచి ఒకరు వేరుపడ్డం ఉభయులకూ శ్రేయస్కరం; సమాజానిక్కూడా అది శ్రేయస్కరమే. అప్పుడు వారు నిరర్థకమైన విడాకుల విచారణ తంతు అనే బురదలో కాళ్ళీడ్చుకొనే గతి తప్పుతుంది....

అయితే, ఏక పత్నీత్వానికి కొత్తగా సంక్రమించే లక్షణాలేవి? మరో కొత్తతరం వృద్ధిచెందిన తర్వాత యిది పరిష్కారమవుతుంది. పురుషులు తమ యావజ్జీవితాల్లో ఎన్నడూ స్త్రీలను ద్రవ్యంతోగాని, ఏ యితర సామాజిక ఆధిపత్య పద్ధతుల్లోగాని క్రయమొనర్చు కోవడం ద్వారా లొంగదీసుకోనప్పుడూ, స్త్రీలు సిసలైన ప్రేమ తప్ప మరో ఉద్దేశంతో పురుషులకు లోబడకుండా ఉన్నప్పుడూ, లేదా ఆర్థిక యిబ్బందుల భయంవల్ల తమ ప్రియులకు తాము సమర్పించుకోజాలనప్పుడూ మాత్రమే యిది (ఏక పత్నీత్వానికి కొత్త లక్షణాలు సంక్రమించే సమస్య)

పరిష్కారమవుతుంది. అట్టి స్త్రీ పురుషులు ఉద్భవించినప్పుడు, వారేమి చేయాలని మనమిప్పు డనుకొంటున్నామో దాన్ని గురించి వారు యిసుమంతైనా ఆలోచించరు. ఒక్కొక్క వ్యక్తి యొక్క ఆచరణను బట్టి వారు తమ ఆచరణను స్వయంగా నిర్ధారించుకొంటారు. తదనుగుణమైన ప్రజాభిప్రాయాన్ని కూడా రూపొందించుకొంటారు. అంతటితో అది పరిపూర్తి అవుతుంది...

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*

*"కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రం" నుంచి (1884)*

# సతీపతుల ప్రేమ

...కొరల్‌ని గురించి మీరు రాస్తూ, ఆయన, ప్రేమ లేనిదే, ఉద్వేగం లేనిదే కుమిలిపోతారనీ, అది ఆయన స్వభావమనీ మీరన్నారు. ఆ స్వభావం ప్రతి రెండేళ్ళకు ఒక కొత్త ప్రేమ అవసరమయేటట్లు చేస్తే, అప్పుడాయన ఒక విషయం స్వయంగా అంగీకరించవలసి వస్తుంది. అదేమంటే, ప్రస్తుత పరిస్థితుల్లో తాను యీ స్వభావాన్ని అదుపులో పెట్టుకోవాలి. లేకపోతే అది ఆయన్నీ, యితరుల్నీ కూడ అంతులేని, విపత్కరమైన సంఘర్షణల్లో యిరికిస్తుంది.

ప్రియమైన లూయీగారూ, నేను మీకీ విషయం స్పష్టంగా చెప్పదలచుకున్నాను. సర్వసాధారణంగా, మన సమాజంలో పురుషుని పట్ల స్త్రీ చేయగలదానికన్న ఘోరమైన అన్యాయాన్ని స్త్రీ పట్ల పురుషుడు సులభంగా చేయగల్గుతాడు; ఎంత మంది పురుషులు, తాము అలాంటి ప్రవర్తనకు పూర్తిగాదూరంగా ఉన్నామని అనుకోగలరు? ప్రపంచంలోని మహా పురుషుల్లో ఒకరిలా అన్నారు: "ఓ పురుషపుంగవుల్లారా, మీరు మీ స్త్రీలకు ఎంత మాత్రమూ అర్హులుకారు." స్వానుభవం ద్వారా ఆయన

చెప్పిన మాట యిది. మీ ఉత్తరం చదువుతూంటే, నేనా మాటను పునరుక్తం చేసుకోవలసి వచ్చింది....

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*ఎల్. కాట్స్కీ సతికి[40] రాసిన ఒక లేఖ నుంచి (1888)*

# విడాకుల కష్టనష్టాలు

...తల్లితండ్రులు తమ ఇష్టానికి వ్యతిరేకంగా తమ కుటుంబంలో ప్రవేశించిన అల్లుని పట్ల లేదా కోడలి పట్ల సక్రమంగా వ్యవహరించడమెంత కష్టమో, ఒక్కొక్కప్పు డదెంత అసాధ్యమో నేను నా సొంత కుటుంబం అనుభవంనుంచి నేర్చుకొన్నాను. తాము అత్యుత్తమమైన ఉద్దేశాలతో వ్యవహరిస్తున్నట్లు తల్లితండ్రులు విశ్వసిస్తారు. కాని, యీ అత్యుత్తమ ఉద్దేశాలు, కొత్తగా కుటుంబంలోకి వచ్చిన సభ్యుని లేదా సభ్యురాలి జీవితాన్ని దుర్భరమొనర్చక మానవు; తద్వారా తమ సొంత కుమారుని లేదా కుమార్తె జీవితాన్ని పరోక్షంగా దుర్భరం చేస్తాయి. ప్రతి భర్తకూ తన భార్యలో ఏదో ఒక లోపం కనిపించవచ్చు; అలాగే ప్రతి భార్యకూ తన భర్తలో ఏదో ఒక లోపం కనిపించవచ్చు. ఇది అనివార్యం. కాని, మూడవ వ్యక్తి, ఎంత సదుద్దేశంతో అయినప్పటికీ, జోక్యం కలిగించుకొంటే మాత్రం, పై సవిమర్శక దృష్టి అయిష్టతగా మారవచ్చు; ఒక్కొక్కప్పుడది శాశ్వత విరోధంగా కూడా పరిణమించవచ్చు. ఇదే నిజమైతే, మీ యిద్దరి అభిప్రాయాలూ సరియైన వన్నమాటే. లూయిూ అభిప్రాయమెందుకు సరియైనదంటే, మీ యిద్దరిమధ్య అట్టి విరోధానికి నిజమైన కారణం లేదు గనుక; మీ అభిప్రాయమెందుకు సరియైనదంటే, మీ సంబంధాలు దాదాపు చిందర వందరగా ఉన్నాయి గనుక.

కాని, కారణమేమైనప్పటికీ, మీ మధ్య విరోధం విడాకులిచ్చుకోడానికి నిశ్చయించుకోవలసినంత తీవ్రమైనదైతే, నేటి

40. లూయిూ కాట్స్కీ = కారల్ కాట్స్కీ మొదటి భార్య.

సమాజంలో భార్య స్థానానికీ, భర్త స్థానానికీ గల వ్యత్యాసాన్ని మొట్టమొదటగా మీరు పరిగణనలోకి తీసుకోవాలనుకుంటాను. సామాజికంగా చూచినప్పుడు, విడాకులు భర్తకు ఏమాత్రం హాని కలిగించదు; అతడు సమాజంలో తన స్థానాన్ని తాను పూర్తిగా నిలబెట్టుకుంటాడు; మరోసారి అతడు బ్రహ్మచారిగా మారుతాడు - అంతే. కాని, భార్య విషయం వేరు. ఆమె తన స్థానాన్ని పోగొట్టుకొంటుంది; కొత్తగా ఆమె జీవితాన్ని ప్రారంభించవలసి వస్తుంది; యిదివరకటి కంటే కష్టమైన పరిస్థితుల్లో ఆమె ఆ జీవితాన్ని ప్రారంభించాలి. అందుచేతనే, భార్య విడాకులు కోరినప్పుడు భర్త ఆమెను బతిమాలవచ్చు; ప్రార్థించవచ్చు; తన్ను తాను అవమానించుకోకుండా అతడేమైనా చేయవచ్చు. కాని, భార్య విషయమలాకాదు. భర్త సూచనప్రాయంగా అయినప్పటికీ విడాకుల విషయం ప్రస్తావిస్తే చాలు, భార్య, ఏమాత్రం ఆత్మగౌరవమున్నదైనా, అతని కోర్కెను యించుమించు బలవంతంగా అంగీకరిస్తున్నట్లు భావిస్తుంది. అందుచేత, భర్త అనివార్య పరిస్థితుల్లోగాని, దీర్ఘకాలం జాగ్రత్తగా ఆలోచించిన తర్వాతగాని, దాని అవసరాన్ని మనసులో స్పష్టంగా గుర్తించిన తర్వాతగాని, యీ సాహస చర్యకు పూనుకొనే హక్కులేదు. అప్పుడుకూడా, సాంగోపాంగంగా పరిశీలించిన మీదటనే దిగాలి...

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*

*కె. కాట్‌స్కీకి[41] రాసిన ఒక లేఖ నుంచి (1888)*

41. కారల్ కాట్‌స్కీ (1854-1938) జర్మన్ సోషల్ డెమాక్రట్, రాజకీయ వ్యాఖ్యాత. "న్యూజీత్" పత్రిక సంపాదకుడు. 1880-90 సంవత్సరాల్లో మార్క్సిజాన్ని బలపరచాడు. కాని తర్వాత దారిమళ్ళి, అవకాశవాదంలో పడ్డాడు; జర్మన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీలోను, రెండవ అంతర్జాతీయ కార్మిక సంస్థలోను మధ్యే మార్గాన్ని బోధించిన సిద్ధాంతవేత్త.

# మేధావుల చివరి అస్త్రం

...మార్క్స్, తనపై కుట్రలు జరుగుతున్నాయని కనుగొన్నప్పుడు, తనకున్న అతిశక్తివంతమైన ఆయుధాన్ని ఆయన పైకి తీసేవారు; దాన్ని ఆయన చాలా తరచుగా ఉపయోగించేవారు. అదేమంటే, తన ప్రత్యర్థుల్ని బయటికీడ్చి, బహిరంగంగా ఎదుర్కోడం...

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*వి. ఐ. జె. సూలిచ్‌కి[42] రాసిన ఒక లేఖనుంచి (1890)*

# వ్యక్తి పూజ నిరసన

...వ్యక్తుల్ని గౌరవించేందుకు ఉద్దేశింపబడ్డ బహిరంగ వేడుకలను మార్క్సూ, నేనూ ఎల్లప్పుడూ వ్యతిరేకించేవాళ్ళం. అవి ఒక ప్రధాన లక్ష్యాన్ని సాధించేందుకయితే వాటిని అనుమతించాలనేది మా అభిప్రాయం. కాని, మా జీవిత కాలంలో, మాతో సంబంధం ఉన్న అత్యధిక వేడుకలకు మే మెల్లప్పుడూ వ్యతిరేకులమే. అందువల్ల, ప్రస్తుత వేడుక నా కోసం ఏర్పాటవుతున్నట్లు ఏ మాత్రపు అనుమానం నాకు తగిలినా, మీ గాయక కామ్రేడ్స్‌ని ముందుగానే వినయంగా, కాని దృఢంగా అడిగేవాణ్ణి తమ ఉద్దేశాన్ని వదులుకోమని. కాని, దురదృష్టవశాత్తు నాకీ విషయం ఈ రోజే తెలిసింది. అందుచేత, నన్ను

42. వి. ఐ .జె. సూలిచ్ (1851-1919) పావ్యులిస్టు ఉద్యమంలోను, తర్వాత సోషల్ డెమాక్రటిక్ ఉద్యమంలోను చురుగ్గా పనిచేశారు. రష్యాలో కార్మిక విమోచన సమితి సభ్యుల్లో ఒకరు. తన రాజకీయ జీవితపు చివరి రోజుల్లో యీమె మెన్షివిక్కుల్ని బలపరచారు.

గౌరవించడానికి మీరు స్నేహ భావంతో తలపెట్టిన కార్యాన్ని అమలు జరక్కుండా చేయవలసిన స్థితిలో నేను అయిష్టంగా పడ్డాను. ఇందుమూలంగా దురభిప్రాయమేమైనా ఏర్పడితే, దాన్ని సాధ్యమైనంత వరకు సరిదిద్దడానికి నేను మీకొక హామీ ఇస్తున్నాను. అదేమంటే, నేను దాదాపు యాభై సంవత్సరాలు ఏ మహదాశయం కొరకు - ప్రపంచ కార్మికోద్యమ ఆశయం కొరకు - వెచ్చించానో, ఆ మహదాశయం కోసం నా జీవితంలో మిగిలియున్న కొద్ది సంవత్సరాల కాలాన్నీ, శక్తి సామర్థ్యాల్నీ వినియోగిస్తాను.

- హృదయపూర్వకంగా,
మీ ఫ్రెడరిక్ ఎంగెల్స్

*- ఫ్రెడరిక్ ఎంగెల్స్*
*లండన్‌లోని జర్మన్ కార్మికుల విద్యాసంస్థ తాలూకు గాయక బృందానికి రాసిన ఒక లేఖ నుంచి (1891)*

# కార్మికశక్తి

ప్రియమైన కామ్రేడ్స్,

అర్హతలేని నాకు మీరీ గౌరవమిచ్చినందుకు నా హృదయ పూర్వకమైన ధన్యవాదా లర్పించనిదే నేనీ సభాస్థలిని విడిచి వెళ్ళలేను. నేను మీకు చెప్పగలిగిందొకటే: కాలధర్మం చెందిన నా మిత్రుడు మార్క్సుకి చెందవలసిన కీర్తి దురదృష్టవశాత్తు నా కొక్కనికే విధి రాతవల్ల లభిస్తోంది. ఈ అవగాహనతోనే నేను మీ హర్షధ్వానాల్ని స్వీకరిస్తున్నాను. గత యాభై సంవత్సరాల్లో నేను ఏ ఉద్యమంలో ఐతే చురుగ్గా పాల్గొన్నానో, ఆ ఉద్యమానికి ఏమైనా సహాయం చేయగలిగియుంటే, దానికి నేను ప్రతిఫలమేమీ కోరను. కామ్రేడ్స్, నాకు లభించిన అత్యంత ఘనమైన ప్రతిఫలం, మిమ్మల్ని ఇక్కడ చూడ్డం. మీ రన్నిచోట్లా - సైబీరియా జైళ్ళలోను, కాలిఫోర్నియా బంగారు గనుల్లోను,

ఆస్ట్రేలియావరకు విస్తరించియున్న ప్రాంతాల్లోను - ఉన్నారని తెలుసుకోవడమూను. ఈ రోజున సోషల్ డెమాక్రసీ ఒక శక్తిగా పరిగణింపబడని దేశంగాని, పెద్ద రాజ్యం గాని లేదు. నేడు ప్రపంచంలో ఎవరు ఏది చేస్తున్నా అది మనల్ని పరిగణనలోకి తీసుకొనీ మన అభిప్రాయాలెలా ఉంటాయో ఊహించుకొనీ చేస్తున్నారు. నేడు మనం ప్రత్యర్థుల్లో భీతి కలిగించే బలమయిన శక్తిగా ఉన్నాం. ఏ ఇతర గొప్ప శక్తులమీద ఆధారపడనంత ఎక్కువగా దీనిమీద ఘటనలు ఆధారపడి యున్నాయి. ఇదే నాలో గర్వానికి కారణమవుతోంది. మనం ఇన్నాళ్ళూ గడిపిన జీవితం వ్యర్థంకాలేదు. ఒకసారి వెనక్కు తిరిగి చూచుకుంటే, మనం గర్వించదగిన, సంతృప్తి చెందవలసిన పనులెన్నో చేశామని స్పష్టమవుతుంది...

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*వియన్నాలో జరిగిన ఒక సోషల్ డెమాక్రటిక్ ర్యాలీలో యిచ్చిన ఉపన్యాసం నుంచి (1893)*

# ముఖప్రీతి వద్దు

ప్రియమైన ప్లెఖనోవ్‌గారికి,

మొట్టమొదటగా మిమ్మల్ని నేను ప్రార్థిస్తున్నాను, నన్ను "గురువు" అని పిలవవద్దని. నా పేరు ఎంగెల్స్ మాత్రమే....

- ఫ్రెడరిక్ ఎంగెల్స్

*జి.వి. ప్లెఖనోవ్‌కి[43] రాసిన ఒక లేఖ నుంచి (1894)*

43. జార్జి వాలెంతనోవిచ్ ప్లెఖనోవ్ (1856-1918) రష్యన్ సోషలిస్టు ఉద్యమంలోను, ప్రపంచ సోషలిస్టు ఉద్యమంలోను ప్రముఖ వ్యక్తి; రష్యాలో ప్రఖ్యాత తత్త్వవేత్త, మార్క్సిజాన్ని ప్రచారం చేసిన వ్యక్తి; మొట్టమొదటి రష్యన్ మార్క్సిస్టు సంస్థ ఐన "కార్మిక విమోచన సమితి" స్థాపకుడు. 1880లో రష్యా నుంచి యితరదేశాలకు వలసవెళ్ళి, మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేసి, ఫ్రెడరిక్ ఎంగెల్స్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, తర్వాత ఆయనతో వ్యక్తిగత సంబంధాలేర్పరచుకున్నారు. ఆయన్ని ఎక్కువగా గౌరవించేవారు.

# హితపూరిత విమర్శ అవసరం

...నిజమే. కామ్రేడ్‌షిప్ అనే ధర్మాన్ని మనం గుర్తిస్తాం. కామ్రేడ్స్ అందరికీ చేయూత నివ్వాల్సిందే; కామ్రేడ్స్ అభిప్రాయాలపట్ల సహనభావం చూపవలసిందే. కాని, మనకు సంబంధించి నంతవరకు రష్యన్ సోషల్ డెమాక్రసీ పట్ల, అంతర్జాతీయ సోషల్ డెమాక్రసీ పట్ల మనం నిర్వర్తించవలసిన ధర్మం నుంచి క్రామేడ్‌షిప్ ఉత్పన్న మవుతుంది. అంతేకాని, దీనినుంచి అదికాదు. "రబోషయా మిసిల్"[44] పట్ల కామ్రేడ్స్‌గా మనం మన ధర్మాన్ని గుర్తిస్తాం; కాని, అందుకు కారణం, దాని సంపాదకులు మన కామ్రేడ్స్ అయి యుండడంవల్ల కాదు. "రబోషయా మిసిల్" సంపాదకులు రష్యన్ సోషల్ డెమాక్రటిక్ ఉద్యమంలో (ఫలితంగా, అంతర్జాతీయ సోషల్ డెమాక్రటిక్ ఉద్యమంలో) పని చేస్తున్న కారణంగానే, ఆ మేరకే, వారిని మనం "కామ్రేడ్స్"గా పరిగణిస్తాం. అందుచేత, మన "కామ్రేడ్స్" వెనక్కు వెళ్తున్నారనీ, సోషల్ డెమాక్రటిక్ కార్యక్రమం నుంచి దూరమవుతున్నారనీ, కార్మికోద్యమ లక్ష్యాలను ఆ "కామ్రేడ్స్" కుంచిస్తున్నారనీ, వక్రీకరిస్తున్నారనీ, మనం ఖచ్చితమైన అభిప్రాయానికి వస్తే, అప్పుడు మన విశ్వాసాలను అతి ఖచ్చితంగాను, అరమరికలు లేకుండాను చెప్పి వేయడం మన ధర్మంగా పరిగణిస్తాం!...

*"రష్యన్ సోషల్ డెమాక్రసీలో ఒక అభివృద్ధి నిరోధక ధోరణి" అనే వ్యాసం నుంచి* ***(1899)***

---

44. "రబోషయా మిసిల్" "ఆర్థిక వాదులు" నడిపే ఒక వార్తాపత్రిక. "ఆర్థిక వాదం" 19వ శతాబ్దం రోజుల్లోను, 20వ శతాబ్దం ప్రారంభ దినాల్లోను సోషల్ డెమాక్రటిక్ ఉద్యమంలో తలెత్తిన ఒక అవకాశవాద ధోరణి; దాని రాజకీయ కార్యక్రమం యిది; కార్మికులు ఆర్థిక హక్కులకై మాత్రమే పోరాడాలి; రాజకీయ హక్కులకై పోరాడవలసింది లిబరల్స్ లేదా ఉదారవాదులు. "ఆర్థిక వాదులు" కార్మికోద్యమంలో మార్క్సిస్టు సిద్ధాంతపు విప్లవాత్మక పాత్రనూ, కార్మికవర్గ నాయకత్వ పాత్రనూ విసర్జించారు. అంతేకాక, స్వతంత్ర కార్మికవర్గ పార్టీ స్థాపనకు వారు వ్యతిరేకులు. లెనిన్ "ఇస్క్రా" పత్రికకు రాసిన వ్యాసాల్లోను, "ఏమి చేయాలి?" అను గ్రంథంలోను "రబోషయా మిసిల్"లోని అభిప్రాయాలను విమర్శించారు. అవి అంతర్జాతీయ అవకాశవాదపు రష్యన్ నమూనా అన్నారు.

# అధికార వర్గ దొరతనం నష్టం

...అధికార వర్గ దొరతనం (బ్యురాక్రసీ) అంటే అర్థం, ఒక వ్యక్తి స్వీయ ఔన్నత్యం కొరకు తాను చేయవలసిన పనిని అడుక్కి తొక్కడం; పదవుల కత్యంత ప్రాధాన్యత నిచ్చి పనిని విస్మరించడం; భావాలకై పోరాడ్డానికి బదులు ఉద్యోగ నియామకాల్ని గురించి తగవులాడుకోవడం. ఈ విధమైన అధికారవర్గ దొరతనం పార్టీకి వినాశకర మనడంలో ఎట్టి సందేహం లేదు...

*"ఒక అడుగు ముందుకు, రెండడుగులు వెనక్కు" అనే పుస్తకం నుంచి (1904)*

# పార్టీతత్వం ప్రాధాన్యం

...మనం విస్తృత ప్రజానీకం యొక్క ప్రయోజనాల్ని కాపాడేందుకు, వారిని సకల విధాలైన బూర్జువా ప్రభావం నుంచి విముక్తి చేసేందుకు, వర్గాల మధ్య సంబంధాల్ని అతి స్పష్టంగా అవగాహన చేసుకొనేందుకు మాత్రమే పార్టీ తత్వాన్ని బలపరుస్తాం. అందుకే, పార్టీతత్వం మాటల్లోనే కాక చేతల్లో కూడా ప్రదర్శింపబడేటట్లు చూస్తాం. ఇందుకై మనం మన శక్తినీ, అప్రమత్తతనూ అత్యధిక స్థాయిలో వినియోగించవలసి యుంది...

*"మరోసారి పార్టీతత్వం, నాన్ పార్టీ తత్వం గూర్చి" అనే వ్యాసం నుంచి (1909)*

# జాతుల మధ్య సమానత్వ ఆవశ్యకత

...కార్మికులు జరిపే వర్గ పోరాటంలో కార్మిక వర్గ సంఘీభావాన్నీ, కార్మికుల ఐక్యతనూ పెంపొందించాలంటే, జాతుల మధ్య సంపూర్ణ సమానత్వం ఉండాలి. ఎందుచేతంటే, జాతుల మధ్య సకల అవిశ్వాసాల్నీ, వేర్పాటునూ, అనుమానాల్నీ, వైరాన్నీ నిర్మూలించడానికిది అవసరం. సంపూర్ణ సమానత్వమంటే, ఏ ఒక్క భాషకు ప్రత్యేక సౌకర్యాలు లేకుండా చేయడం, అన్ని జాతుల స్వయం నిర్ణయ హక్కును గుర్తించడమూను...

*"శుద్ధ మొనర్చిన జాతీయ వాదంతో కార్మికుల్ని కలుషిత మొనర్చడం" అనే వ్యాసం నుంచి (1914)*

# ప్రజాతంత్ర వాదుల్లో-విడాకుల స్వేచ్ఛ

...అభివృద్ధి నిరోధకులు విడాకులిచ్చే స్వేచ్ఛను వ్యతిరేకిస్తారు; దానిని "జాగ్రత్తగా ఉపయోగించుకోవా"లంటారు. విడాకులంటే "కుటుంబ విచ్ఛిత్తి" అని బిగ్గరగా అరుస్తారు. కాని, ప్రజాతంత్ర వాదులలా కాదు. అభివృద్ధి నిరోధకులు కపటులనీ, నిరంకుశోద్యోగుల, పోలీసుల సర్వాధిపత్యాన్ని ఆచరణలో సమర్థిస్తారనీ ప్రజాతంత్ర వాదులంటారు. స్త్రీ పురుషుల్లో పురుషుల ప్రత్యేక హక్కుల్నీ, స్త్రీలను అతి హీనంగా అణచిపెట్టి యుంచడాన్నీ అభివృద్ధి నిరోధకులెలా బలపరుస్తారో వారు చూపుతారు. విడాకులిచ్చే స్వేచ్ఛ ఆచరణలో కుటుంబ సంబంధాల "విచ్ఛిత్తి"కి దారితీయదనీ, పైగా వాటిని ప్రజాతంత్ర ప్రాతిపదికపై పటుతర మొనర్చుతుందనీ, నాగరిక సమాజంలో అదొక్కటే

ఆచరణీయమైన, చిరకాలం వర్ధిల్లగలిగిన ప్రాతిపదిక అనీ వారు నమ్ముతారు...

"జాతులకు స్వయం నిర్ణయ హక్కు" అనే వ్యాసం నుంచి *(1914)*

# ప్రేమించే స్వేచ్ఛ-శ్రామిక వర్గదృష్టి-1

ప్రియమిత్రమా,

ఉదాహరణకు, యిప్పుడే నేనొక అభిప్రాయం తెలియజేస్తాను.

**3వ అధికరణం:** "ప్రేమించే స్వేచ్ఛను[45] గూర్చిన (స్త్రీల) డిమాండు"ను పూర్తిగా ఎత్తివేయమని మీకు సలహా యిస్తున్నాను.

అది నిజంగా శ్రామికవర్గ డిమాండు కాదు; బూర్జువా డిమాండు మాత్రమే.

ఇంతకూ, ఆ పదానికి మీ అర్థం ఏమిటి? దాన్ని ఏవిధంగా మనం అర్థం చేసుకోగలం?

1. ప్రేమకు సంబంధించిన భౌతిక (ద్రవ్య విషయిక) యిబ్బందుల నుంచి స్వేచ్ఛ పొందడమా?
2. ప్రేమకు సంబంధించిన విషయాల్లో భౌతిక క్లేశాలనుంచి స్వేచ్ఛ పొందడమా?
3. మత దురభిమానంనుంచి స్వేచ్ఛ పొందడమా?
4. తండ్రులు వగైరా విధించే ఆంక్షలనుంచి స్వేచ్ఛ పొందడమా?
5. "సామాజిక" దురభిమానాలనుంచి స్వేచ్ఛ పొందడమా?
6. పరిసరాల సంకుచిత స్థితులనుంచి (రైతాంగ లేదా పెటీబూర్జువా లేదా బూర్జువా మేధావుల) స్వేచ్ఛ పొందడమా?
7. న్యాయశాస్త్రం, కోర్టులు, పోలీసులు విధించే శృంఖలాలనుంచి స్వేచ్ఛ పొందడమా?
8. ప్రేమలోని గంభీరాంశ (Serious element) నుంచి స్వేచ్ఛ పొందడమా?

---

45. ఇది మన చలం సిద్ధాంతం లాటిది. అర్మండ్ పేర్కొంటున్న ప్రేమించే స్వేచ్ఛ, చలం బోధించిన స్వేచ్ఛా ప్రణయం యించుమించు ఒకటే.

9. ప్రసవాలనుంచి స్వేచ్ఛ పొందడమా?

10. జారత్వం నుంచి స్వేచ్ఛ పొందడమా?

పైన నేను చాలా ఛాయాభేదాల్ని పేర్కొన్నాను. (అన్నీ పేర్కొన లేదనేది స్పష్టమే). 8-10 అంశాలు మీ దృష్టిలో లేవనేది స్పష్టం; 1-7 అంశాలో, వాటి లాంటివో మీ దృష్టిలో ఉన్నాయి.

కాని, మీరు 1-7 అంశాలకు మరో శబ్దజాలాన్నెంచుకోవాలి. ఎందుచేతంటే, యీ భావాన్ని స్వేచ్ఛా ప్రణయం సరిగా వివరించ జాలదు.

పైగా, ప్రజలూ, యీ కరపత్రపు పాఠకులూ "ప్రేమించే స్వేచ్ఛ" అంటే స్థూలంగా 8-10 అంశాల వంటివని అనివార్యంగా అర్థం చేసుకుంటారు - మీరు దాన్ని ఉద్దేశించకపోయినప్పటికీ, ఆధునిక సమాజంలో అత్యంత వాచాలురు, అతిగోల చేసేవారు, "అత్యున్నత ప్రముఖులు" అయిన వర్గాలు "ప్రేమించే స్వేచ్ఛ" అనగా 8-10 అంశాలేనని అర్థంచేసుకున్నంత మాత్రాన, కేవలం ఆ కారణం చొప్పున, అది శ్రామికవర్గ డిమాండు కాజాలదు; బూర్జువా డిమాండు మాత్రమే అవుతుంది.

శ్రామిక వర్గానికి 1-2 అంశాలు అత్యంత ప్రధానమైనవి; యిక, నిజం చెప్పాలంటే, 1-7 అంశాల్లో ఏవీ "ప్రేమించే స్వేచ్ఛ" కానేకావు.

అసలు విషయమేమంటే, మీరు స్వీయాత్మకంగా దీన్నెలా అర్థం చేసుకొంటున్నారనేది కాదు. ప్రేమకు సంబంధించిన విషయాల్లో వర్గసంబంధాల బాహ్యాత్మక దృక్పథం ఏదనేదే అసలు విషయం.

స్నేహపూర్వక కరచాలనంతో,

- వి.ఐ.

### *ఇనెస్సా ఆర్మండ్[46]కి రాసిన ఒక లేఖ (జనవరి 17, 1915)*

---

46. ఇనెస్సా ఆర్మండ్ (1874-1920) 1904 నుంచీ పార్టీలో సభ్యురాలు; విప్లవాన్ని వృత్తిగా స్వీకరించిన మహిళ; కార్మికోద్యమంలోను, కమ్యూనిస్టు ఉద్యమంలోను ప్రముఖ వ్యక్తి; 1905-07 విప్లవంలో పాల్గొన్నారు. అనేక అంతర్జాతీయ మహాసభల్లోను, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ మహాసభలోను పాల్గొన్నారు. రష్యన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) కేంద్రకమిటీ యొక్క మహిళా విభాగానికి అధ్యక్షురాలు. లెనిన్ కుటుంబానికి స్నేహితురాలు.

# ప్రేమించే స్వేచ్ఛ శ్రామిక వర్గదృష్టి - 2

ప్రియమిత్రమా,

మీకు జవాబు రాయడంలో నేను ఆలస్యం చేసినందుకు క్షమించమని కోరుతున్నాను. నిన్ననే ఇది రాద్దామనుకున్నాను; కాని వీలుపడలేదు; పైగా, కూర్చొని రాయడానికి వ్యవధి లేకపోయింది.

కరపత్రానికి సంబంధించిన ప్రణాళిక విషయమై నా అభిప్రాయం మీకు తెలియజేశాను. "ప్రేమించే స్వేచ్ఛ అను డిమాండు" అస్పష్టంగా ఉందనీ, మీ ఉద్దేశమూ కోరిక ఏదైనప్పటికీ (అసలు విషయం బాహ్యాత్మకమైన వర్గ సంబంధాలనీ, మీ స్వీయాత్మక ఉద్దేశాలు కావనీ రాసినప్పుడు నేనీ విషయాన్ని నొక్కి చెప్పాను), ప్రేమించే స్వేచ్ఛ అను డిమాండు ప్రస్తుత సామాజిక పరిస్థితుల్లో శ్రామికవర్గ డిమాండు కాజాలదనీ, బూర్జువా డిమాండ్‌గానే తయారవుతుందనీ నేను తెలియజేశాను.

కాని, మీరు నాతో ఏకీభవించడం లేదు.

చాలా మంచిది. దీన్నే మరోసారి పరిశీలిద్దాం.

అస్పష్టమైనదాన్ని స్పష్టం చేసేందుకై, దీనికి దాదాపు పది భిన్నవ్యాఖ్యానాలుండడం సాధ్యమని (వర్గాలమధ్య వైషమ్యం ఉన్న నేటి పరిస్థితుల్లో యిది అనివార్యమనికూడా) నేను తెలియజేశాను. అలా తెలియజేసేటప్పుడు, 1-7 వ్యాఖ్యానాలు శ్రామిక స్త్రీల విషయంలోను, 8-10 వ్యాఖ్యానాలు బూర్జువా స్త్రీల విషయంలోను నప్పుతాయని నా అభిప్రాయాన్ని చెప్పాను.

దీన్ని మీరు తిరస్కరించే పక్షంలో, (1) ఇవి తప్పు వ్యాఖ్యానాలని మీరు చూపాలి (అప్పుడు, వాటి స్థానంలో కొత్తవాటిని చేర్చాలి; లేదా ఏవి తప్పు వ్యాఖ్యానాలో సూచించాలి); లేదా (2) ఇవి అసమగ్రమైనవని చూపాలి (అప్పుడు, లోపించిన వాటిని మీరు కలపాలి); లేదా, (3) ఇవి పై విధంగా శ్రామిక, బూర్జువా డిమాండ్లుగా వర్గీకరింపబడలేదని నిరూపించాలి.

మీరు వీటిలో మొదటిదిగాని, రెండవదిగాని, మూడవదిగాని చేయలేదు.

1-7 అంశాలను మీరు అసలు స్పృశించనేలేదు. దీని అర్థం, యివి సరియైనవేనని (మొత్తం మీద) మీ రంగీకరిస్తున్నట్లా? (శ్రామిక స్త్రీల వ్యభిచారాన్ని గురించీ, వారి పరాధీనతను గురించీ - "వద్దనడం అసాధ్యం" - మీరు రాసింది పూర్తిగా 1-7 అంశాల కిందికే వస్తుంది; ఈ విషయంలో మనిద్దరిమధ్య ఎవరూ ఎట్టి భేదాన్నీ కనిపెట్టలేరు).

ఇది శ్రామికవర్గ వ్యాఖ్యానం కాదనికూడా మీరనడంలేదు.

అటువంటప్పుడు, 8-10 అంశాలే యిక మిగిలాయి. ఇవి మీకు "బాగా అర్థం కాలేదు." అంటున్నారు; వీటికి మీరు "అభ్యంతరం" కూడా చెబుతున్నారు. "ప్రేమించే స్వేచ్ఛనూ, 10వ అంశాన్నీ ఒకే గాటన కట్టడం (!!??) ఎలా సాధ్యమో (మీరు రాసింది యిదీ) అర్థం కావడంలేదు," అని మీరంటున్నారు....

దీన్నిబట్టి, నేను వీటిని "ఒకే గాటన కడుతున్నా" నన్నమాట; మీరు నన్ను ఖండిస్తున్నారన్నమాట; కూలదోస్తున్నారన్నమాట.

కాని, ఏ విధంగా?

ప్రేమించే స్వేచ్ఛఅంటే 8-10 అంశాలేనని బూర్జువా స్త్రీలు అర్థం చేసుకుంటారు - యిదీ నా వాదన.

దీన్ని మీరు కాదంటారా? కాదంటే, బూర్జువా మహిళలు ప్రేమించే స్వేచ్ఛను మీరెలా అర్థం చేసుకుంటారో చెప్పండి.

కాని, మీరది చెప్పరు. బూర్జువా స్త్రీలు దీన్ని సరిగ్గా యిలాగే అర్థం చేసుకుంటారని సాహిత్యమూ, జీవితం రుజువు చేయడం లేదా? పూర్తిగా యిదే రుజువు చేస్తున్నాయి! మీరు దీన్ని భావార్థంలో అంగీకరిస్తున్నారు.

ఇది సరియైనదైనప్పుడు, అసలు విషయం వాటి వర్గదృక్పథం. ఈ విషయంలో వాటిని "తిరస్కరించడం" అసాధ్యమేకాక, యించుమించు మూఢత్వమవుతుంది.

కాబట్టి, మీరు చేయవలసిందేమంటే, వాటినుంచి శ్రామికవర్గ దృక్పథాన్ని స్పష్టంగా విడమర్చి చూడాలి. అవి శ్రామికవర్గ దృక్పథంతో

ఎలా భేదిస్తాయో చూడాలి. లేనిచో, వారు మీ కరపత్రంనుంచి తమ కనుకూలమైన భాగాలను లాక్కుంటారు. తమకిష్టమైన విధంగా వాటిని వ్యాఖ్యానిస్తారు. మీ కరపత్రాన్ని తమ యంత్రంలో నీరుగా వాడుకుంటారు. కార్మికుల దృష్టిలో దాన్ని వక్రంగా చిత్రిస్తారు. ఆ విధంగా కార్మికుల్ని "గందరగోళ పరుస్తారు". (మీరు పరాయి భావాలను తీసుకొస్తున్నారనే భయాన్ని వారిలో నాటుతారు). ఈ బాహ్యాత్మక వాస్తవాన్ని మనం పరిగణనలోకి తీసుకోవాలి.

కాని, మీరు బాహ్యాత్మకమైన వర్గ దృక్పథాన్ని పూర్తిగా విస్మరించి, నేను ప్రేమించే స్వేచ్ఛనూ, 8-10 అంశాలనూ ఒకే గాటన కడుతూన్నట్లు నా మీద "దాడి" చేస్తున్నారు... ఇది అర్థంలేని విషయం; నిజంగా అర్థం లేని విషయం.

(నీచమైన, తెలివిమాలిన) ఒక వివాహిత జంటయొక్క "ప్రేమరహితమైన ముద్దుల" కంటె "క్షణికమైన కామోద్రేకం, సాన్నిహిత్యం అయినా సరే" "ఎక్కువ కావ్యాత్మకమైనదీ, నిష్కల్మషమైనదీను". ఇదీ మీరు రాసింది. దీన్నే మీ కరపత్రంలో కూడా రాయదలచుకొన్నారు. చాలా బాగుంది.

మీరు చూపిన తారతమ్యం తర్కానికి నిలుస్తుందా? నీచమైన ఒక జంట మధ్య ప్రేమరహితమైన ముద్దులు కలుషితమైనట్టివే. నేనంగీకరిస్తాను. కాని, అందుకు భిన్నమైన వాటిని మనం చూపాలి... అవి ఏవి?... ప్రేమతో కూడిన ముద్దులైయుండాలని ఎవరమైనా అనుకుంటాం. కాని, మీరు వాటికీ, "క్షణికమైన" (ఎందుకు క్షణికమో?) "కామోద్రేకానికీ" (ప్రేమ ఎందుకు కాకూడదో?) మధ్య భేదం చూపుతున్నారు. కాబట్టి, హేతుబుద్ధితో చూచినప్పుడు, తేలేది ఏమంటే, (క్షణికమైన) ప్రేమ లేని ముద్దులకూ, వివాహితుల మధ్య ప్రేమలేని ముద్దులకూ భేదం ఉంటుందన్నమాట... చిత్రంగా ఉంది. అంతకంటె, ప్రజలకు సుబోధకంగా ఉండే ఒక కరపత్రంలో, ప్రేమ లేనట్టీ, కపటమైనట్టీ మేధావి - రైతాంగపు (నా అంశాల్లో 6వది, లేదా 5వది) తుచ్ఛమైన, కలుషితమైన వివాహాలకూ, కార్మికవర్గపు ప్రేమపూరితమైన పౌర వివాహాలకూ, గల భేదాన్ని చూపడం చక్కగా ఉండదా? (మీరు తప్పనిసరి అనుకుంటే, మరొకటి కూడా చేర్చవచ్చు. అదేమంటే,

క్షణికమైన సాన్నిహిత్యం, కామోద్రేకం కలుషితమైనట్టిదీ కావచ్చు, నిష్కల్మషమైనట్టిదీ కావచ్చు). మీరు ఏ నిర్ధారణకైతే వచ్చారో, అది వర్గ లక్షణాలు గల వాటి మధ్య వ్యత్యాసం కాదు; అదొక "తాత్కాలిక సంఘటన" మాత్రమే. అలాంటివి సంభవం కావచ్చు కూడా. కాని, ప్రస్తుత సమస్య ఏవో కొన్ని తాత్కాలిక సంఘటనలకు సంబంధించినదా? మీరొక తాత్కాలిక సంఘటనను రచనా వస్తువుగా తీసుకొని, యిద్దరు వివాహితుల మధ్య కానవచ్చే కలుషితమైన ముద్దుల్నీ, అవివాహితుల క్షణిక సాన్నిహిత్యంలో కానవచ్చే నిష్కల్మషమైన ముద్దుల్నీ పోల్చి చూపదలచుకొంటే, అదొక నవలలో సంభవం కావచ్చు. (ఎందుచేతంటే, నవలలో అసలు విషయమంతా వేర్వేరు పరిస్థితుల్లో, పాత్రల విశ్లేషణలో ప్రత్యేక వ్యక్తుల మనఃప్రవృత్తుల్లో ద్యోతకమవుతుంది). కాని, కరపత్రంలోనో?

"ప్రేమ బోధకుల" పాత్ర ధరించడం "మూర్ఖత్వం" అని మీరంటున్నారు. కాని, మీరు ఉటంకించిన కే[47] గారి వాక్యం సందర్భశుద్ధి లేనట్టిది. దాన్ని గురించి నా అభిప్రాయమేమిటో మీకు చక్కగా తెలుసు. మీరు చెప్పింది నిజమే కాని, క్షణికాది విషయాలను బోధించే వారి మాటేమిటండీ?

నేను సిద్ధాంత వివాదాల్లో యిరుక్కోదలచుకొనలేదనేది నిజం. నేనీ జాబును యిష్టపూర్వకంగా పక్కకుతోసి, స్వయంగా మనం మాట్లాడుకొనేవరకు దీన్ని వాయిదా వేయగలను. కాని, మీ కరపత్రం చక్కనిదై యుండాలనేది నా కోరిక. అది అలా ఉంటే, ఎవరూ, మీకు బాధకలిగించగల పదాల్ని దాన్నుంచి విడగొట్టి, మీ భావానికి వక్రభాష్యం చెప్పలేని స్థితిలో ఉంటారు (జాడీ నిండావున్న తేనెలో ఒ చంచాడు తారు కలిపితే ఏమవుతుంది? ఒకేఒక శబ్దం అప్పుడప్పు డలాంటి ఫలితాన్నే యిస్తుంది). ఇది కూడా మీరు "కోరుకోకుండానే" రాశారని నాకు చక్కగా తెలుసు. నేను మీకీ ఉత్తరాన్ని పంపడంలో ఉద్దేశం ఒక్కటే. అదేమంటే, మన సంభాషణ తర్వాత కంటే యీ ఉత్తరాలవల్ల మీరీ ప్రణాళికను

47. ఎల్లెన్ కే (1849–1926) స్వీడన్‌కి చెందిన బూర్జువా రచయిత్రి; మహిళల ఉద్యమానికీ, బాలల పెంపకానికీ సంబంధించిన సమస్యలపై గ్రంథాలు రాశారు.

ఎక్కువ వివరంగా పరిశీలించగలుగుతారనీ, ఈ ప్రణాళిక చాల ప్రధానమైనదనీ మీరు గమనించాలి.

మీకు ఫ్రెంచి సోషలిస్టు మిత్రురాలెవరూ లేరా? ఉన్నట్లయితే, నేను పేర్కొన్న 1-10 అంశాలను ఆమెకు అనువదించి చెప్పండి (ఆంగ్లం నుంచి అనువదిస్తున్నట్లే). వాటికి "క్షణిక" వగైరా విషయాలపై మీరు రాసిన అభిప్రాయాల్ని జోడించండి. అప్పుడామెను పరికించి చూడండి. ఆమె చెప్పేది సాధ్యమైనంత శ్రద్ధగా వినండి. దీన్ని గురించి బయటి వారేమనుకుంటారో, వారి అభిప్రాయాలేమిటో, వారీ కరపత్రం నుంచి ఆశించేది ఏమిటో తెలుసుకోడానికి యిదొక ప్రయోగం.

మీకిదే నా కరచాలనం; మీకు తలనొప్పి యిదివరకటంత తరచుగా రావడంలేదనీ, త్వరలో మీ ఆరోగ్యం బాగుపడాలనీ కోరుతూ,

- వి. ఉ.

*ఇనెస్సా ఆర్మండ్‌కి రాసిన మరొక లేఖనుంచి (జనవరి 24, 1915)*

# రాజకీయాల్లో నిజాయితీ

...రాజకీయాల్లో నిజాయితీ అంటే అర్థం, వ్యక్తులతో కాక లక్షలాది ప్రజలకు సంబంధించిన మానవ సంబంధాల్లో మాటలకూ, చేతలకూ మధ్య పొంతన ఉండడం; అది సులభంగా నిరూపింపగలిగేదై యుండడం...

*"మీరెవరిని చూచి నవ్వుతున్నారు.? మిమ్మల్ని చూచే"! అనే వ్యాసం నుంచి (1917)*

# నివేదిక లివ్వడం ఎలా?

...బ్లాక్‌మెయిల్ చేసేవారిని (హడలుకొట్టి దోచుకుపోయే వాళ్ళు - సం.) వాతవేసి చూపడంలో మనం దృఢంగా నిలబడాలి. అతి స్వల్పమైన అనుమానాలు పొడసూపినప్పటికీ, వాటిపై తీర్పు యివ్వడం కోసం వర్గచైతన్యం గల కార్మికులముందు, పార్టీముందు నిక్కచ్చిగా మనం నివేదించాలి. మనం మనపార్టీమీద విశ్వాసం ఉంచుతాం. మన కాలపు విజ్ఞతను, గౌరవాన్ని, వివేచనను అందులో తిలకిస్తాం...

*"రాజకీయ బ్లాక్‌మెయిల్" అనే వ్యాసం నుంచి (1917)*

# సోషలిజం శత్రువుల పట్ల కాఠిన్యం అవసరం

...కార్మిక కర్షకులారా, శ్రమజీవులారా, పీడిత ప్రజలారా: నేడు భూమి, బ్యాంకులు, ఫ్యాక్టరీలు ప్రజలందరి సొత్తు అయాయి. సరకుల ఉత్పత్తినీ, పంపకాన్నీ మదింపువేసుకొనేందుకు, అదుపులో ఉంచుకొనేందుకు మీరే స్వయంగా కృషి చేయడానికి ఉపక్రమించాలి.

సోషలిజం విజయానికి యిదే, యిది ఒక్కటే మార్గం; విజయానికి యిదొక్కటే గ్యారంటీ; సకల విధాలైన దోపిడీని, దారిద్ర్యాన్ని, లేమిని తుదముట్టించేందుకు యిదొక్కటే హామీ! ఎందుచేతంటే, యీనాడు ప్రజలందరి అవసరాలను తీర్చేందుకవసరమైన రొట్టె, ఇనుము, కలప, ఉన్ని, పత్తి, నార - అన్నీ రష్యాలో ఉన్నాయి; అయితే వాటిని వినియోగంలోకి తీసుకురావడానికి శ్రమనూ, శ్రమవల్ల తయారయే సరుకుల్నీ సరిగా పంపకం చేయాలి. ఈ పంపకాన్ని యావన్మంది ప్రజలు క్రమబద్ధంగాను, ఆచరణాత్మకంగాను అదుపులో ఉంచాలి.

ప్రజాశత్రువుల్ని, అనగా ధనికుల్నీ వారి తాబేదారుల్నీ, మోసగాండ్రనూ, సోమరుల్నీ, రౌడీల్నీ రాజకీయరంగంలో మాత్రమే కాక దైనందిన ఆర్థిక జీవితంలో కూడా మట్టుపెట్టాలి.

ఈ ప్రజా శత్రువుల పట్ల, సోషలిజానికి శత్రువుల పట్ల, శ్రమజీవుల శత్రువుల పట్ల దయా దాక్షిణ్యాలు చూపకూడదు. ధనికులపైన, వారి తాబేదార్ల పైన, బూర్జువా మేధావుల పైన చచ్చేదాకా యుద్ధం చేదాం; మోసగాండ్రపైన, సోమరులపైన, రౌడీలపైన యుద్ధం చేదాం! వీరందరు ఏకోదరులు; పెట్టుబడిదారీ వర్గపు బిడ్డలు; ఫ్యూడల్, బూర్జువా సమాజపు అంకురాలు; ఏ సమాజంలో ఐతే కొద్దిమంది వ్యక్తులు ప్రజానీకాన్ని కొల్లగొట్టుకొన్నారో, పరాభవించారో, ఆ సమాజంలో పుట్టి పెరిగిన వ్యక్తులు వీరు; ఏ సమాజంలో ఐతే దారిద్ర్యం, లేమి లక్షలాది ప్రజల్ని రౌడీయిజానికీ, అవినీతికీ, మోసానికీ దింపి, వారిలో మానవ లక్షణాలు లేకుండా చేశాయో, ఆ సమాజంలో ఉద్భవించినవారు; ఏ సమాజం ఐతే శ్రామికునిలో మోసం ద్వారా అయినా సరే దోపిడీ నుంచి తప్పించుకోవాలనే కోర్కెను, దాన్నుంచి మెలిదిరిగి బయట పడాలనే కోర్కెను, అసహ్యకరమైన శ్రమనుంచి ఒక్క క్షణమైనా సరే బయట పడాలనే కోర్కెను తానూ తన కుటుంబం అవకాశంగల ఏ పద్ధతి ద్వారా అయినా సరే, ఎంత మూల్యం యిచ్చి అయినాసరే పట్టెడు మెతుకులు సంపాదించుకొని ఆకలిబాధ తీర్చుకోవాలనే కోర్కెను అనివార్యంగా పెంచి పోషించిందో - ఆ సమాజం నుంచి ఉద్భవించినవారే వీరంతా.

ధనికులు, మోసగాండ్రు ఒకే నాణెం యొక్క రెండు పార్శ్వాలు; పెట్టుబడిదారీ విధానం పెంచిపోషించిన రెండు తరగతుల పరాన్న భుక్కులు; సోషలిజానికి వారు ప్రధాన శత్రువులు. ఈ శత్రువుల్ని ప్రజలందరి ప్రత్యేక పర్యవేక్షణలో వుంచాలి. వారు సోషలిస్టు సమాజపు చట్టాలను, నిబంధనలను ఎంత స్వల్పంగా ఉల్లంఘించినా, నిర్దాక్షిణ్యంగా శిక్షించాలి. ఈ విషయంలో ఏమాత్రపు బలహీనతను, అనుమానాన్ని, మెతకదనాన్ని ప్రదర్శించినా, అది సోషలిజం పట్ల పెద్దనేరమే అవుతుంది.

ఈ పరాన్నభుక్కులు సోషలిస్టు సమాజానికి హాని చేయకుండా చూడాలంటే, యావన్మంది ప్రజలు, లక్షలాది కార్మికులు, రైతులు, స్వచ్ఛందంగా, శక్తివంతంగా, విప్లవోత్సాహంతో పాల్గొనేటట్లు చేయడం ద్వారా, పని పరిమాణాల్నీ, ఉత్పత్తి - పంపకాల్నీ మదింపు వేస్తూ అదుపులో వుంచుకోవాలి. ఈ కార్యక్రమాన్నంతనూ మనం ఆర్గనైజు చేయాలి. ఈ పని, నిజాయితీపరుడైన, తెలివి గలిగిన, శక్తివంతుడైన ప్రతి కార్మికుడు, ప్రతి రైతు చివరిదాకా చేయగలిగిందే. ఈ మదింపును, అదుపును ఆర్గనైజు చేయాలంటే, వారందరిలోను వుండే ఆర్గనైజింగ్ శక్తుల్ని ఉద్దీపింపజేయాలి. ఆర్గనైజింగ్ కృషికి సంబంధించిన యీ రంగంలో మనం పోటీ పద్ధతిని ప్రవేశపెట్టి, దాన్ని జాతీయ స్థాయిలో అమలు జరపాలి. విద్యావంతుని అవశ్య సలహాకూ, కార్మికుడూ, రైతూ చేబట్టే అవశ్య అదుపుకూ గల భేదాన్నేకాక, సాధారణంగా "విద్యావంతుల్లో" కనిపించే ఆషామాషీ లక్షణాన్ని కూడా కార్మిక కర్షకులు స్పష్టంగా గమనించేటట్లు చూడాలి...

...కింది స్థాయిలో ద్యోతకమయే చొరవను, స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛాయుత వర్తనను, దృఢత్వాన్ని స్వచ్ఛంద కేంద్రీకృతాధికారంతో జోడించడ మెలాగో పారిస్ కమ్యూన్ గొప్పగా చూపెట్టింది. ఈ కేంద్రీ కృతాధికారం పోత విగ్రహాల రూపంలో వుండకూడదు. నేడు మన సోవియట్లు ఈ మార్గంలోనే పయనిస్తున్నాయి. కాని, అవి యిప్పటికీ "భీరుత్వాన్ని" ప్రదర్శిస్తున్నాయి. అవింకా సోషలిస్టు వ్యవస్థను నిర్మించే నూతన కర్తవ్యాన్ని, మహాకర్తవ్యాన్ని, సృజనాత్మక కర్తవ్యాన్ని "చేబట్ట" లేదు. ఆ దారిలో యింకా పడని సోవియట్లు మరింత ధైర్యంగా పనిచేయాలి? యింకా ఎక్కువ చొరవను ప్రదర్శించాలి. అన్ని కమ్యూన్లు ఫ్యాక్టరీలు, గ్రామాలు, సహకార సంస్థలు, సప్లై కమిటీలు - శ్రమనూ, సరకుల పంపకాన్నీ మదింపు వేసే, అదుపులో వుంచే సంస్థలుగా ఒకదానితో ఒకటి పోటీ పడాలి. అలా మదింపు వేసే, అదుపులో వుంచే కార్యక్రమం అందరికీ సులభమైనది, స్పష్టమైనది, సుబోధకమైనదీను. ఆ కార్యక్రమం యిది; ప్రతివానికీ తిండి, చక్కని జోళ్ళు, మంచి దుస్తులు, వెచ్చని ఇల్లు; ప్రతివ్యక్తీ త్రికరణ శుద్ధిగా పనిచేయడం; ఏ మోసగాణ్ణీ

(పని ఎగవేసే వారితో సహా) స్వేచ్ఛగా వదలక జైల్లో నిర్బంధించడం, లేదా అతికఠినమైన నిర్బంధ శ్రమ విధించి దాన్ని శిక్షగా అనుభవించేటట్లు చేయడం; సోషలిస్టు చట్టాల్నీ, నిబంధనల్నీ ఉల్లంఘించే ఏ ధనికుడూ - మోసగానికి పట్టే గతి నుంచి - తప్పించుకోలేకుండా చేయడం, "పనిచేయని వ్యక్తి భుజించరాదు" - అనేది సోషలిజం యొక్క ఆచరణాత్మక నిబంధన. పరిస్థితుల్ని ఆచరణాత్మకంగా ఆర్గనైజు చేయవలసిన పద్ధతి యిది. మన "కమ్యూన్లు," మన కార్మిక - కర్షక ఆర్గనైజర్లు ఈ ఆచరణాత్మక విజయాలను చూచే గర్వపడాలి. ఇది ముఖ్యంగా మేధావుల మధ్య పనిచేసే ఆర్గనైజర్లకు వర్తిస్తుంది. (ముఖ్యంగా అని అనడమెందుకంటే, మేధావులు సాధారణ ఉత్తర్వులకు, తీర్మానాలకు మరీ అధికంగా, అత్యధికంగా గర్వించడం అలవాటు)...

*"పోటీ పద్ధతినెలా ఆర్గనైజ్ చేయాలి?" అనే వ్యాసం నుంచి (1917)*

# లంచగొండికి శిక్ష

లంచం తీసుకున్న వ్యక్తులపై తేబడిన కేసులో (మే 2, 1918) లంచగొండితనం రుజువైనప్పటికీ, తాము లంచం తీసుకున్నట్టు ముద్దాయి అంగీకరించినప్పటికీ, ఆ ముద్దాయిలకు ఆరు నెలలు మాత్రమే జైలుశిక్ష విధించిన న్యాయమూర్తుల్ని పార్టీనుంచి వెళ్ళగొట్టే విషయం ఎజండాలో చేర్చవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను.

లంచం తీసుకున్న వ్యక్తుల్ని కాల్చి చంపడానికి బదులు వారికి హాస్యాస్పదమైన తేలిక శిక్ష విధించడం ఏ కమ్యూనిస్టుకైనా, ఏ విప్లవకారునికైనా అవమానకరం. అట్టి కామ్రేడ్స్‌ని ప్రజాభిప్రాయమనే న్యాయస్థానంలో అరుతూకు[48] వేసి, పార్టీనుంచి వెళ్ళగొట్టవలసి

---

48. అరుతూకు - కొన్ని పెద్ద రకాల నేరాలు చేసినవారిని అవమాన పరచడానికి ఒక మంచె లాంటిది తయారుచేసి, దానికొక చెక్క అమర్చి, దాని రంధ్రాల్లో మెడనూ, చేతుల్నీ తగిలించి, కొంతసేపు నిలబెట్టి ఉంచుతారు.

యుంటుంది. ఎందుచేతనంటే, వారు కెరెన్‌స్కీ[49] మార్టోవ్[50] ల సరసన ఉండవలసినవారే గాని, విప్లవ కమ్యూనిస్టుల సరసన కాదు.

*రష్యన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి (1918)*

# సోషలిస్టు కర్తవ్యం

...రాజకీయ చైతన్యంగల ప్రతి కార్మికుడు, తాను తన ఫ్యాక్టరీలో యజమానినని మాత్రమే కాక, దేశానికి ప్రతినిధినని కూడా భావించుకోవాలి; తన బాధ్యతను తాను గుర్తించాలి. రాజకీయ చైతన్యంగల కార్మికుడు, తాను తన వర్గానికి ప్రతినిధినని తెలుసుకోవాలి. బూర్జువా వర్గానికీ, లాభార్జన పరులకూ వ్యతిరేకంగా జరిగే పోరాటంలో నాయకత్వం వహిస్తే, అతడు జయించి తీరుతాడు. ప్రతి సోషలిస్టు నిర్వర్తించవలసిన కర్తవ్యమేమిటో రాజకీయ చైతన్యంగల కార్మికుడు అర్థం చేసుకుంటాడు. అప్పుడతడు విజయం సాధిస్తాడు.

*అఖిల రష్యన్ కార్మిక మంత్రుల ద్వితీయ మహాసభలో యిచ్చిన ఉపన్యాసం నుంచి (1918)*

49. కెరెన్‌స్కీ - ఎ.ఎఫ్. కెరెన్‌స్కీ. 1917లో రష్యాలో అధికారం చేజిక్కించుకున్న బూర్జువా విప్లవ ప్రతిఘాత ప్రభుత్వానికి అధిపతి; సోవియట్ ప్రభుత్వానికి శత్రువు.

50. ఎల్. మార్టోవ్ (1873–1923) మెన్షివిక్ నాయకులలో ఒకడు. రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరు పార్టీ రెండవ మహాసభలో అల్పసంఖ్యాక అవకాశవాద ముఠాకు నాయకుడు. అప్పటి మెన్షివిక్ నాయకుల్లో ఒకడుగా ఉంటూ, మెన్షివిక్ పత్రికలకు, యితర ప్రచురణలకు సంపాదకుడుగా ఉండేవాడు; అక్టోబరు విప్లవం తర్వాత సోవియట్ ప్రభుత్వానికి బాహాటమైన శత్రువులతో చేరిపోయాడు; 1902 లో జర్మనీకి వలసవెళ్ళాడు.

# విశ్రాంతి ఆవశ్యకత

## ఎ. డి. స్యురుపాకూ, ఆయనను గురించీ రాసిన లేఖలు

### I

జూలై 1918

కామ్రేడ్ స్యురుపా,

మీరు ఆరోగ్యంగా ఉన్నట్లు లేదు. వెంటనే మీరు రెండు నెలలు విశ్రాంతి తీసుకోవాలి. అలాతీసుకుంటానని మీరు నమ్మకంగా వాగ్దానం చేయకపోతే, నేను కేంద్ర కమిటీకి ఫిర్యాదు చేయవలసి వస్తుంది.

\- లెనిన్

# కార్యకర్తలకు ఆరోగ్యరక్షణ

### II

1918 వేసవి

ఎ. డి. స్యురుపా గారికి,

ప్రియమైన అలెగ్జాండర్ డిమిట్రియేవిచ్‌గారూ,

మీరు ప్రభుత్వ ఆస్తిని[51] ఉపయోగించడంలో మరీ

మీరు మూడు వారాలు వైద్య చికిత్సకై వెళ్ళిరావలసిందని యిందుమూలంగా ఆజ్ఞాపిస్తున్నాను. మిమ్మల్ని లిడియా అలెగ్జాండ్రోవ్నా ఒక శానిటోరియంకు పంపుతారు. ఆమె చెప్పినట్లు మీరు చేయాలి.

51. లెనిన్ తన సహచరుల ఆరోగ్యాన్ని గురించి చమత్కారంగా చెప్పేటప్పుడు ప్రయోగించే శబ్దం యిది.

నిజం చెప్పాలంటే, అంతంతగా ఉన్న మీ ఆరోగ్యాన్ని యీ విధంగా పాడుచేసుకోడం క్షమించరాని విషయం. మీరు మీ పద్ధతుల్ని సరిదిద్దుకోవాలి.

*- అభివందనలతో, మీ లెనిన్*

## III

## ఉత్తరువు

జూలై 13, 1918

ప్రజామంత్రి కామ్రేడ్ స్యురుపా కుంట్సేవోలోని ఒక శానిటోరియంలో విశ్రాంతీ, వైద్య చికిత్స పొందడానికి తరలి వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించడమైనది.

*- ప్రజా మంత్రిమండలి ఛైర్మన్, వి. ఉల్యానోవ్ (లెనిన్)*

## IV

## ఉత్తరువు

ఆగస్టు 24, 1918

ఎ. డి. స్యురుపా ప్రభుత్వ ఆస్తిపట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నందుకు (రెండుసార్లు గురి అయ్యారు).

మొదటిసారి హెచ్చరిక చేయడమైంది. తక్షణమే ఆయన యింటికి వెళ్ళిపోవాలి (ఆయన స్థానంలో యుర్యేవ్ వస్తారు; రూజర్‌గారిని కూడా మేము రమ్మంటాం).

- లెనిన్

## V

## ఎల్. ఎ. ఫోతియేవాకు[52] లేఖ

లిదియా అలెగ్జాండ్రోవ్నా,

ఇందులో స్యురుపాకు రాసిన లేఖ జతపరుస్తున్నాను.

52. ఎల్. ఎ. ఫోతియేవా = ప్రజా మంత్రిమండలి కార్యదర్శి; కార్మిక రక్షణ కౌన్సిలు కార్యదర్శి; లెనిన్ అంతరంగిక కార్యదర్శి.

ఆయనను విశ్రాంతి కోసం ఏదో ఒక గ్రామానికి పంపాలి. ఆయన తన సోదరుని ద్వారాను, స్వెర్డ్లోవ్ ద్వారాను నాదగ్గరకు[53] వచ్చే ఏర్పాటు చేయండి. ఇక్కడొక పెద్ద అందమైన గది ఉంది. అది వెచ్చచేయబడి యుంటుంది. మేము దాన్ని విడిచిపెట్టి వెళ్ళాక, స్యురుపా కోసం ఒక వంటలక్కను వెతకాలి. ప్రజామంత్రుల కొరకు యిక్కడొక శానిటోరియం నిర్మించవచ్చు. ఈ విషయమై మనం ఏమిచేయగలమో తప్పక ఆలోచించండి.

- *అభినందనలతో, లెనిన్*

# కమ్యూనిజం నిర్మాణం దేన్నుంచి

... పెట్టుబడిదారీ విధానం సృష్టించిన సామగ్రినుంచే మనం కమ్యూనిజాన్ని నిర్మించగల్గుతాం. పెట్టుబడిదారీ పరిస్థితుల మధ్య మలచబడ్డ పరిష్కృత సాధనం నుంచే కమ్యూనిజాన్ని నిర్మించగలం; అందువల్ల, ఆ సాధనం - ముఖ్యంగా అందులోని మానవఅంశ - అనివార్యంగా పెట్టుబడిదారీ మనస్తత్వాన్ని పరివేష్టించి యుంటుంది. అందువల్లనే కమ్యూనిస్టు సమాజ నిర్మాణం కష్టసాధ్యమైన పని. కాని, అది నిర్మింపబడగలదు, నిర్మింపబడి తీరుతుంది అనడానికి ఆధారం కూడా ఇదే. నిజం చెప్పాలంటే, మార్క్సిజానికీ, అంతకు పూర్వపు ఊహాజనిత సోషలిజానికీ గల తేడా ఏమంటే, రక్తసిక్తమైన, నికృష్టమైన, క్రూరమైన, వ్యాపార తత్వం గలిగిన పెట్టుబడిదారీ విధానం సృష్టించిన బహుళమానవ సంపద నుంచి కాక, ఉష్ణగృహాల్లోను, ఉద్యాన వాటికల్లోను పెంచి పోషింపబడ్డ సద్గుణ సంపన్నుల నుంచి నూతన సమాజాన్ని సృష్టించాలనుకొంది ఊహాజనిత సోషలిజం. ఈ అర్థరహితమైన అభిప్రాయం నిజంగా అర్థరహితమని అందరూ ఈనాడు

53. లెనిన్ 1918 వేసవిలో అప్పుడప్పుడు ఉత్తర రైల్వేలైను మీదనున్న తరసోవ్కా వద్ద కొమరోవ్కా అను గ్రామంలో ఒక ఆరోగ్య శిబిరానికి వెళ్ళివస్తూ ఉండేవారు.

గమనించారు. అందరూ దీన్ని విసర్జించారు. కాని, దీనికి విరుద్ధమైన మార్క్స్ సిద్ధాంతాన్ని ఆకళింపు చేసుకోడాని కందరూ ఈనాడు ఇష్టపడ్డం లేదు; సాహసించడం లేదు. బహుళ మానవ సంపద వందల వేల సంవత్సరాల బానిసత్వంచే, అర్థ బానిస విధానంచే, పెట్టుబడిదారీ విధానంచే, వ్యక్తిగత స్వల్పోత్పత్తి సంస్థలచే కలుషితమొనర్చబడింది. ప్రతి వ్యక్తీ మార్కెట్‌లో ఏదో ఒక స్థానం సంపాదించడానికి, తన సరకు లేదా శ్రమకు అధిక ధర రాబట్టుకోడానికి తన పొరుగువానిమీద జరిపే పోరాటం కూడా దాన్ని కలుషితమొనర్చింది. అట్టి అశేష మానవ సంపద నుంచి కమ్యూనిజాన్నెలా నిర్మించవచ్చునో (నిర్మించి తీరాలో) ఎవరూ ఆలోచించలేకపోతున్నారు.

*"పెద్ద సమస్యల్ని చిత్రీకరించే ఒక చిన్న చిత్రం" అనే వ్యాసం నుంచి*
*(1918 చివర, లేదా 1919 ప్రారంభం)*

# సామాజిక సమస్యల యెడ కాఠిన్యం

...సోవియట్ ప్రభుత్వపు చట్టాలను ధిక్కరించి రైతులను న్యాయ విరుద్ధంగా బాధించేవారిని నిర్దాక్షిణ్యంగా ప్రతిఘటించాలి, తక్షణమే వారిని బర్తరఫుచేయాలి; అతి కఠినంగా ప్రాసిక్యూట్ చేయాలి. అట్టివారు రష్యన్ భూస్వాముల, పెట్టుబడిదారుల వ్యవస్థయొక్క "అవశేషాలు". వారు మన కార్మిక - కర్షక రిపబ్లిక్ యొక్క చట్టాల కనుగుణంగా, సోవియట్‌లు ఎన్నుకొన్న వారివలె వ్యవహరించవలసి యుండగా, చట్టాలను పాటించడంలో ఇతరులకు మార్గదర్శకులై మెలగవలసి యుండగా, "పెత్తందార్ల" వలె వ్యవహరిస్తున్నారు. ఆ విధంగా వారు దిగజారిపోతున్నారు. అట్టివారి బారినుంచి రష్యాను క్షాళన చేయడానికి నిజాయితీ పరులయిన కార్మిక కర్షకులు శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు. సోవియట్ ప్రభుత్వం అలాంటి అధికారుల్ని ఇదివరకే కాల్చి చంపింది. వారు లంచాలు తీసుకోడంవంటి నేరాలు చేసినందుకు అరెస్టు

చేయబడ్డారు. అట్టి తుచ్ఛులకు వ్యతిరేకంగా పోరాటం చివరవరకు కొనసాగుతుంది....

...ఇదివరకటి వ్యాపార స్వేచ్ఛను, లాభార్జన స్వేచ్ఛను, పోరాట స్వేచ్ఛను, పీడన స్వేచ్ఛను-ప్రపంచాన్నంతనూ రక్తపుటేరుల్లో ముంచెత్తడానికి గల స్వేచ్ఛను - తుదముట్టించాలంటే, కార్మిక కర్షకులు చాలా కష్టపడి పనిచేయాలి, క్రమశిక్షణ పాటించాలి.

కష్టమైన ఈ పనిని లక్షలాది కార్మికులు, రైతులు ఈ రోజున చేపట్టారు. నిజాయితీపరుడయిన ప్రతి రైతు, ప్రతి కార్మికుడు సోషలిజం ప్రాధాన్యతను గ్రహించాడు. దానికోసం పట్టుదలతో పోరాడుతున్నాడు.

*"ఒక రైతు అడిగిన ప్రశ్నకు జవాబు" అనే వ్యాసం నుంచి (1919)*

# శ్రమదాన ప్రాధాన్యం

(వెనుదట్టు కార్మికుల వీరత్వం: "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్"లు[54])

...వెనుదట్టు కార్మికుల వీరత్వం చిన్నచూపు చూడవలసిందేమీ కాదు. ఈ విషయంలో, కార్మికులు సొంత చొరవతో నెలకొల్పిన కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు నిజంగా అత్యంత ప్రాధాన్యం గలవి. ఇది ప్రారంభం మాత్రమే నన్నది స్పష్టం; కాని ప్రత్యేక ప్రాధాన్యతగల ప్రారంభం. బూర్జువా వర్గాన్ని కూలద్రోయడంకన్న కష్టమైన, సుగ్రాహ్యమైన, తీవ్రమైన, నిర్ణాయకమైన విప్లవానికి యిది ప్రారంభదశ. ఎందుచేతనంటే, యిది మన అలసత్వం మీద ఒక విజయం.

---

54. కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు - ప్రజలు స్వచ్ఛందంగా, ప్రతిఫల మేమీ తీసుకోకుండా చేసేపని. ఇది శ్రమపట్ల కమ్యూనిస్టు దృక్పథాన్ని తెలియజేస్తుంది. మాస్కో - కజాన్ రైల్వేపనివారు 1919లో మొట్టమొదటి సుబ్బోత్నిక్‌కు ప్రారంభోత్సవం చేశారు. సోషలిస్టు అనుసరణోద్యమాన్ని ప్రారంభించింది యీ సుబ్బోత్నిక్కే. సుబ్బోత్నిక్‌ల కాలంలో కార్మికులు తమ ఉన్నత చైతన్యాన్నీ, శ్రామిక వీరత్వాన్నీ ప్రదర్శించారు.

శిక్షణారాహిత్యంమీద, పెటీ బూర్జువా అహంభావం మీద ఒక విజయం. తుచ్ఛమైన పెట్టుబడిదారీ విధానం కార్మిక కర్షకులకు వారసత్వంగా విడిచిపెట్టిన అలవాట్లమీద ఒక విజయం. ఈ విజయాన్ని పటిష్టమొనర్చినప్పుడే... నూతన సామాజిక శిక్షణ, సోషలిస్టు శిక్షణ సృష్టింపబడుతుంది. అప్పుడే, పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడ్డం అసాధ్యమవుతుంది. అప్పుడే కమ్యూనిజం నిజంగా అజేయమవుతుంది.

...కమ్యూనిస్టు పద్ధతిలో వృద్ధిచెందే సామాజిక శ్రమనిర్మాణం భూస్వాముల, పెట్టుబడిదార్ల ఆధిపత్యాన్ని కూలదోసిన శ్రమజీవుల స్వచ్ఛంద, చైతన్యయుత శిక్షణమీద ఆధారపడి యుంటుంది. కాలం గడిచేకొద్దీ, అంతకంతకు అధికంగా అది ఈ శిక్షణ మీదనే ఆధారపడి యుంటుంది. అట్టి సామాజిక శ్రమ నిర్మాణం యొక్క తొలిమెట్టు సోషలిజం.

...శ్రామికవర్గం విజయం సాధించడానికి, సోషలిజాన్ని నిర్మించి పటిష్ట మొనర్చడానికి రెండు కర్తవ్యాలను నిర్వర్తించవలసి యుంటుంది. మొదటిది, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిగే విప్లవపోరాటంలో అత్యున్నత సాహసాన్ని ప్రదర్శించడంద్వారా మొత్తం శ్రమజీవులందరినీ, పీడిత ప్రజలందరినీ తనవైపు తిప్పుకోవాలి. బూర్జువా వర్గాన్ని కూలదోసి దాని ప్రతిఘటనను పూర్తిగా అణచివేయడానికి జరిగే పోరాటంలో వారందరినీ తనవైపు తిప్పుకొని, సంఘటిత మొనర్చి, నాయకత్వం వహించాలి. రెండవదేమంటే, శ్రామిక ప్రజలందరినీ, పీడిత ప్రజలందరినీ, పెటీ బూర్జువా గ్రూపులన్నింటినీ నూతన ఆర్థికాభివృద్ధికి దారితీసే మార్గంలో, నూతన సామాజిక బంధాన్ని నిర్మించే దిశగా నడపాలి; ఒక నూతన కార్మిక శిక్షణను, ఒక నూతన శ్రమ నిర్మాణాన్ని అలవరచే విధంగా వారిని నడపాలి. ఇవి, అత్యున్నత స్థాయికి చేరుకొన్న విజ్ఞానశాస్త్రాన్నీ, బూర్జువా సాంకేతిక విద్యనూ బహు జన కార్మిక శక్తితో జతకలుపుతాయి; భారీ సోషలిస్టు పరిశ్రమలను నిర్మించే కార్మికుల సామూహిక శక్తితో, వర్గ చైతన్యంగల కార్మికుల సమిష్టి శక్తితో జతకలుపుతాయి.

రెండవ కర్తవ్యం మొదటిదాని కంటె కష్టతరమైనది. ఎందుచేతనంటే, అది వ్యక్తిగత సాహస చర్యలవల్ల నెరవేరేది కాదు; సర్వ

సామాన్యమైన దైనందిన కార్యాల్లో అత్యంత దీర్ఘకాలికమైన, అత్యంత పట్టుదలతోకూడిన, అత్యంత కష్టసాధ్యమైన ప్రజా సాహసం అందుకవసరం......

..."కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు" ఎందుకింత ప్రాధాన్యం గలవంటే, వాటిని ప్రారంభించినది ఏ మాత్రపు ప్రత్యేక సౌకర్యాలు లేని కార్మికులు. వేర్వేరు రంగాల్లో ప్రత్యేక నిపుణత కలిగినవారూ, ఏ రంగంలోనూ ప్రత్యేక నిపుణత లేనివారూను. మామూలు పరిస్థితుల్లో, అనగా అతి నికృష్టమైన పరిస్థితుల్లో జీవించే కార్మికులు కూడా వారిలో ఉన్నారు...

...అయినప్పటికీ, ఆకలిగొన్న యీ కార్మికులు పెట్టుబడిదార్ల, మెన్షివిక్కుల, సోషలిస్టు రివల్యూషనరీల దురుద్దేశపూరిత, విప్లవ ప్రతీఘాతక ఆందోళనలచే చుట్టుముట్టబడినప్పటికీ, జీతాలు తీసుకోకుండా, నిర్ణీత గంటలకు మించిపనిచేస్తూ, "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్"లను నిర్మిస్తున్నారు. వారెంత డస్సియున్నప్పటికీ, శరీర కష్టం వారిని పీల్చి పిప్పి చేస్తున్నప్పటికీ, పోషకాహారం లేక వారెంత కృశిస్తూన్నప్పటికీ శ్రామిక ఉత్పాదకతను వారు అపారంగా పెంచుతున్నారు. ఇదంతా అత్యున్నతమైన సాహసం కాదా? అత్యంత ప్రధానమైన మార్పుకు నాందీ వాచకం కాదా?

అంత్య పరిశీలనలో, నూతన సామాజిక వ్యవస్థ విజయానికి శ్రామిక ఉత్పాదకత అత్యంత ప్రధానమైన అంశం...

...ఆకలితో అలమటించే మాస్కో నగరంలో నాలుగు కఠోర సంవత్సరాలు సామ్రాజ్యవాద యుద్ధంలోను, మరో సంవత్సరన్నర అంతకంటె కఠోరమైన అంతర్యుద్ధంలోను యమ బాధలనుభవించి డొక్కలు మాడ్చుకొన్న కార్మికులు యీ గొప్ప కార్యాన్ని 1919 వేసవిలో సాధించగలిగారంటే, ముందు ముందు, మనం అంతర్యుద్ధంలో విజయం సాధించి శాంతిని స్థాపించిన తర్వాత పరిస్థితులెంతగా అభివృద్ధి చెందుతాయో కదా!

పెట్టుబడీదారీ విధానంతో పోలిస్తే, కమ్యూనిజంలో స్వచ్ఛందమైన, రాజకీయ చైతన్యం గల, ఐకమత్యం గల కార్మికులు ఉన్నత సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగంలో పెడుతూ, శ్రామిక ఉత్పాదకతను అపారంగా

పెంచుతారు. కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు క్రియారంగంలో కమ్యూనిజానికి నాందీ వాచకం పలుకుతాయి. ఆ విధంగా అవి అమిత ప్రాధాన్యతను కలిగి యున్నాయి. ఇదెంతో అపురూపమైన విషయం. ఎందుచేతంటే, మనం యీనాడు "పెట్టుబడిదారీ విధానం నుంచి కమ్యూనిజానికి పరివర్తన చెందే దశలో మొదటి అడుగులు మాత్రమే వేస్తున్నాం" (దీన్నే మన పార్టీ కార్యక్రమం అతి చక్కగా తెలియజేసింది.)

కమ్యూనిజం ఎప్పుడు ప్రారంభమవుతుందంటే, సాధారణ కార్మికులు కండలు కరిగించి పనిచేయడానికి వెరవకుండా, శ్రామిక ఉత్పాదకతను పెంచడానికి ఉత్సాహం చూపినప్పుడు, ప్రతి పూడ్[55] ధాన్యాన్నీ, బొగ్గునూ, యినుమునూ, యితర సరుకులనూ ఉత్పత్తి చేయడానికి శ్రద్ధ చూపినప్పుడు అది ప్రారంభమవుతుంది. ఆ సరుకులు కార్మికులకుగాని, వారి "సన్నిహిత" బంధుమిత్రులకుగాని కాక, "దూరపు" బంధుమిత్రులకు, అనగా సమాజానికి, వేల లక్షల సంఖ్యలోనున్న ప్రజానీకానికి లభిస్తాయి. వారంతా మొదట సోషలిస్టు రిపబ్లిక్‌లోను, తర్వాత సోవియట్ రిపబ్లికుల యూనియన్‌లోను ఐక్యమవుతారు.

గంభీర వాక్కులు తగ్గించండి; మామూలు రోజువారీ పనులు హెచ్చించండి. ప్రతి పూడ్ ధాన్యం పట్ల, ప్రతి పూడ్ బొగ్గుపట్ల శ్రద్ధ వహించాలి! వాటిని ఆకలిగొన్న కార్మికులకు, చింకిపాతల రైతులకు అందజేయడంలో మరింత శ్రద్ధ వహించాలి. ఈపనిని బేరసారాల ద్వారా కాక, పెట్టుబడిదారీ పద్ధతిలో కాక, చెమటోడ్చి పనిచేయడం ద్వారా నిర్వహించాలి. మాస్కో - కజాన్ రైల్వేలో పనిచేసే మామూలు కార్మికులవంటి, రైల్వే కార్మికులవంటి శ్రమజీవుల చైతన్యయుత శ్రమ ద్వారా ఐచ్ఛిక శ్రమద్వారా సాహసోపేతమైన శ్రమద్వారా నిర్వహించాలి.....

....స్త్రీల పరిస్థితిని తీసుకుందాం. ఈ విషయంలో, మనం అధికారంలో ఉన్న ఒక్క సంవత్సర కాలంలో చేసిన పనిలో నూరవవంతు పనిని అత్యంతాభివృద్ధి చెందిన ఏ బూర్జువా రిపబ్లిక్‌లోనూ ఏ ఒక్క ప్రజాతంత్ర పార్టీ కూడ దశాబ్దాలకాలంలో చేసియుండలేదు. మనదేశంలో

55. పూడ్ అనగా 36 పౌనుల బరువుగల తూకం.

కొన్ని పాడుచట్టాలు స్త్రీలను అసమానస్థితిలో అట్టేపెట్టాయి. విడాకుల హక్కును పరిమితమొనర్చాయి; దాన్ని రోతపుట్టించే లాంఛనాలతో చుట్టుముట్టాయి; అవివాహితుల బిడ్డలను గుర్తించ నిరాకరించాయి; తమ తండ్రులెవరో కనుగొనేటట్లు నిర్బంధించాయి. ఇలాగే ఇంకాఎన్నో నిర్బంధాలు. ఇంలాటి చట్టాల అవశేషాలు అసంఖ్యాకంగా అన్ని నాగరిక దేశాల్లోను ఉన్నాయి. ఈ పరిస్థితి పెట్టుబడిదారీ వర్గానికీ, పెట్టుబడి దారీ విధానానికీ సిగ్గుచేటైన విషయం. ఇట్టి పాడు చట్టాలను మనం నిజంగా నేల కూల్చాం. ఈ రంగంలో మనం సాధించిన వాటికి వెయ్యి సార్లు గర్వపడవచ్చు. కాని, పాత ఇంటి కట్టెల దొడ్డిని, అనగా పాత బూర్జువా చట్టాలను, సంస్థలను ఎంత సమగ్రంగా శుభ్రపరిస్తే, అంత మనకొకటి స్పష్టంగా బోధపడుతుంది. అదేమంటే, కొత్త యింటి నిర్మాణానికి నేలను శుభ్రపరచడం మాత్రమే మనం చేశాం; యింటిని మాత్రం యింకా కట్టడం లేదు.

ఎన్నో చట్టాలు స్త్రీని విముక్తి చేసినప్పటికీ, ఆమె ఇంకా యింటి దాసీగానే ఉంది. ఎందుచేతనంటే, చిన్న చిన్న యింటి పనులెన్నో ఆమెను కుంగదీస్తున్నాయి; నులిమి వేస్తున్నాయి; వ్యర్థ జీవిని చేస్తున్నాయి; భ్రష్టురాల్ని చేస్తున్నాయి; వంటింటికీ, బిడ్డల పెంపకానికీ బంధించి యుంచుతున్నాయి. ఆమె తన శ్రమను ఉత్పత్తికి అసలే తోడ్పడని బండచాకిరీ మీద, నరాలను తోడివేసేటట్టి, నిరర్థకమైనట్టి కృశింప జేసేటట్టి, దాస్య కర్మల మీద వ్యర్థం చేస్తోంది. ఈ అత్యల్పమైన గృహ నిర్వహణ కార్యాల మీద సమగ్రమైన పోరాటం ఎక్కడ, ఎప్పుడు ప్రారంభమవుతుందో, (దాన్ని నడపవలసింది అధికారం చేబట్టిన కార్మిక వర్గం), అక్కడ, అప్పుడు నిజమైన స్త్రీ స్వాతంత్ర్యం ప్రారంభమవుతుంది; నిజమైన కమ్యూనిజం ప్రారంభమవుతుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, సమగ్రమైనరూపంలో బృహత్ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా అది పరివర్తన చెందడం ప్రారంభమైనప్పుడే నిజమైన స్త్రీ స్వాతంత్ర్యం, నిజమైన కమ్యూనిజం ప్రారంభమవుతుంది...

ఇది సిద్ధాంతరీత్యా నిర్వివాదాంశమేనని ప్రతి కమ్యూనిస్టు అంగీకరిస్తాడు. కాని, మనం యీ సమస్య పట్ల తగినంత శ్రద్ధ వహిస్తున్నామా? లేదనేది స్పష్టమే. ఈ రంగంలో యిదివరకే కమ్యూనిజం

యొక్క మొలకలు ప్రత్యక్షమై యున్నాయి. కాని, మనం వాటిపట్ల సరియైన జాగ్రత్త తీసుకొంటున్నామా? లేదని మళ్ళీ చెప్పాలి. వాటికి చక్కని ఉదాహరణలు పబ్లిక్ కాంటీన్లు, శిశు సంరక్షణ కేంద్రాలు, బాలల విద్యాలయాలు. ఇవి, అట్టహాసాల్లేకుండా, డాంబికాల్లేకుండా, లాంఛనాల్లేకుండా స్త్రీలను నిజంగా విముక్తి చేయగలవు. స్త్రీలు సామాజికోత్పత్తిలోను, ప్రజా జీవితంలోను, నిర్వహించవలసిన పాత్రకు సంబంధించి నంతవరకు, యివి వారి అసమానతను నిజంగా తగ్గించగలవు; నిర్మూలించగలవు...

...ఈ విషయంలో "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌లు" అతివిలువైన మినహాయింపు అని చెప్పవచ్చు. ఎందుచేతనంటే, మాస్కో - కజాన్ రైల్వేకు చెందిన మామూలు పనివారు, రైల్వే కార్మికులు మొట్టమొదటిసారిగా తాము కమ్యూనిస్టులవలె పనిచేయగలమని చేతల ద్వారా రుజువు చేశారు. ఆ తర్వాత వారు, తామే ఆ కార్యాన్ని సాధించినందున, "కమ్యూనిస్టు సుబ్బోత్నిక్‌ల" మని పేరు పెట్టుకున్నారు. ఇక మీదట, ఏ వ్యక్తి అయినా ఈ విషయాన్ని తన శ్రమ ద్వారా రుజువుచేసుకోకుండా, దీర్ఘకాలకృషిలో విజయం సాధించకుండా, ఆదర్శవంతంగా కృషి చేయకుండా, నిజమైన కమ్యూనిస్టు కృషిలో పాల్గొనకుండా తన ఉత్పత్తి సంస్థను, లేదా సంఘాన్ని, లేదా నిర్మాణాన్ని కమ్యూన్ అని పిలుచుకొంటే, అట్టి వానిని మనం నిర్దాక్షిణ్యంగా వెక్కిరించాలి; కుటిలునిగా, వాచాలునిగా ఎండగట్టాలి....

*"ఒక గొప్ప ప్రారంభం" అనే వ్యాసంనుంచి (1919)*

# పనిలో జాప్యం నేరం

## మమాదిష్ మండల కార్యనిర్వాహక వర్గానికి టెలిగ్రాం (1919)

మమాదిష్ మండల కార్యనిర్వాహక వర్గం సొర్మోవోకి చెందిన కమ్యూనిస్టు రుక్‌విష్నికోవ్, ఇప్పటికి నెలరోజులుగా జైల్లో ఉన్న విషయం,

ఆయనమీద యింతవరకు కేసు విచారింపబడలేదనే విషయం నిజమేనా? నిజమే అయితే, అందుకు బాధ్యుడైన వానిని అధికార జాప్యమనే నేరానికి విచారించాలి. టెలిగ్రాం ద్వారా జవాబు పంపండి (281).

- *ప్రజామంత్రిమండలి ఛైర్మన్, లెనిన్*

# పరిశోధకులకు సౌకర్యాల కల్పన

## వి. ఐ. తనయేవ్‌కి టెలిగ్రాం (ఏప్రిల్ 26, 1919)

ప్రజామంత్రిమండలి 1919 మార్చి 25 న సమావేశమైనప్పుడు. వి. ఐ. తనయేవ్‌కి భౌతిక సహాయం గురించి ఆలోచించి, యీ కింది విధంగా తీర్మానించింది:

"(అ) దుర్బలుడు, 78 ఏండ్లవాడు అయిన వి. ఐ. తనయేవ్ అనేక సంవత్సరాలుగా పరిశోధన కృషిలో ఉన్నారు. కారల్ మార్క్స్ మాటల్లో చెప్పాలంటే, ఈయన ప్రజల విముక్తికై అంకితమైన ఒక స్నేహితుడు, అని రుజువు చేసుకున్నారు. ఈయనకు ప్రతినెలా 2000 రూబుళ్ళు సామాజిక భృతిగా యిచ్చుటకు తీర్మానించడమైంది.

"(ఆ) ఈయన కీయవలసిన రక్షణ సర్టిఫికెట్ మీద కామ్రేడ్ లెనిన్ సంతకం చేయాలని తీర్మానించడమైంది - మినిట్స్ నెం. 270, ఫోల్డరు 2)

ప్రజా మంత్రిమండలి 1919 మార్చి 25న చేసిన నిర్ణయం ప్రకారం ఈ రక్షణ సర్టిఫికెట్ వ్లాదిమిర్ ఐవానోవిచ్ తనయేవ్‌కి ఇవ్వడమైంది; ఈయన వయస్సు 78 ఏళ్ళు; అనేక సంవత్సరాలుగా పరిశోధన కృషి చేస్తున్నారు; కారల్ మార్క్స్ చెప్పినట్లు, ఈయన "ప్రజల విముక్తికై అంకితమైన ఒక స్నేహితుడు"గా రుజువుచేసుకున్నారు.

పౌరుడు వ్లాదిమిర్ ఐవానోవిచ్ తనయేవ్ ప్రజా మిత్రమండలి గ్రంథాలయానికి వెళ్ళివస్తూ ఉండడానికి హక్కు యివ్వడమైంది; యితర

ప్రభుత్వ గ్రంథాలయాలు కూడా ఆయన పరిశోధన కృషికి సర్వవిధాలా తోడ్పడవలసిందిగా కోరడమైంది. పౌరుడు వ్లాదిమిర్ ఐవానోవిచ్ తన యేవ్నీ, ఆయన కుటుంబాన్నీ కాపాడవలసిందిగా, ఆయన యింటినీ, ఆస్తినీ రక్షించవలసిందిగా సోవియట్ అధికార సంస్థలను అజ్ఞాపించడమైంది. ఆయన రష్యన్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్‌లో ప్రయాణం చేయదలచుకుంటే, రైల్వే అధికారులందరూ, షిప్పింగ్ అధికారులంతా పౌరుడు వ్లాదిమిర్ ఐవానోవిచ్ తనయేవ్‌కి రైలు టిక్కెట్లు, సీట్లు లభించేలా సాధ్యమైన సహాయమంతా చేయవలసిందని ఉత్తరువు చేయడమైంది.

*- ప్రజామంత్రిమండలి ఛైర్మన్, వి. ఉల్యానోవ్ (లెనిన్)*

# బాధ్యతారహిత జవాబుకు శిక్ష

## వి. ఎ. అవన సేవ్[56] కి లేఖ (మే 20, 1919)

(ఈ కింది ఘటనను పురస్కరించుకొని లెనిన్ ఈ లేఖ రాశారు: ప్రజా మంత్రిమండలికి సంబంధించిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసుకు 1919 మే 13, 14 తేదీల్లో రెండు దరఖాస్తు లందేయి. అవి రైతులు పెట్టుకున్న దరఖాస్తులు; ప్రజామంత్రిమండలి ఛైర్మన్‌ని ఉద్దేశిస్తూ పెట్టుకొన్నవి; వాటిలో, స్థానికాధికారులు తమ దుక్కి గుర్రాల్ని చట్ట విరుద్ధంగా స్వాధీనం చేసుకున్నట్లు ఫిర్యాదు చేశారు; ఆ రెండు దరఖాస్తుల్నీ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు లెనిన్‌కి యివ్వకుండా, జనరల్ ఫీల్డ్ హెడ్‌క్వార్టర్స్‌కి చెందిన మొబిలైజేషన్ కమిషన్‌కి పంపింది. ఆ కమీషన్ రాజధాని వ్యవహారాల స్పెషల్ కమీషన్‌కి పంపింది. అది వాటిని ప్రజా మంత్రిమండలి ఛైర్మన్‌కి తిప్పి పంపుతూ, కవరుమీద ఇలా ఒక నోట్ రాసింది. “మేము చేయవలసిన పనులింకా చాలా ఉన్నాయి. యిలాంటి

---

56. వి.ఎ. అవనసేవ్-స్టేట్ కంట్రోలు కమీషన్ కలీజియంలో సభ్యుడు 1924 వరకు కార్మిక కర్షక తనిఖీ శాఖకు బాధ్యత వహించిన డిప్యూటీ మంత్రి, అఖిల రష్యన్ కేంద్ర నిర్వాహక వర్గంలో అధ్యక్ష వర్గ సభ్యుడు.

స్వల్ప విషయాలమీద మా కాలాన్ని వృథా చేయలేం;" ఈ జాబు లెనిన్‌ని కోపోద్రిక్తుణ్ణి చేసింది).

స్టేట్ కంట్రోలు కమిషన్‌లోని అవనసేవ్‌కి,

ఇలా జవాబిచ్చిన అధికారిని అరెస్టు చేయండి.

# బాలల వేసవి శిబిరాల ప్రాధాన్యం

## బాలల్ని వేసవి శిబిరాలకు పంపేటందుకు చేయవలసిన ఏర్పాట్లను గూర్చి (1919)

మన బాలల్ని ఉత్తర రాష్ట్రాల నుంచి దక్షిణానికి తరలించే కార్యక్రమం ప్రారంభమైంది. వేసవి కాలమంతా వారికి దక్షిణ రాష్ట్రాల లోని వేసవి శిబిరాలలో వసతి కల్పించబడింది. ఇందుకు సంబంధించిన ఏర్పాట్లన్నీ కేంద్ర యుద్ధ ఖైదీల నిర్వహణ సంస్థ, కాందిశీక సహాయక సంస్థ చేయవలసియుంది. కేంద్ర వైద్యశాఖ చేసిన నిర్ణయం ప్రకారం, సాధ్యమైనంత వరకు ఆసుపత్రి రైళ్ళు ఉపయోగింపబడతాయి. అయితే, అవి పరిమిత సంఖ్యలోనే ఉంటాయి. అందుచేత, వాటిని అత్యంత సమర్థతతో ఉపయోగించవలసి యుంటుంది. కాబట్టి, నేను అర్జంటుగా కోరేదేమంటే, ఆసుపత్రి రైళ్ళు బాలల్ని దింపివేయవలసిన చోట్ల దింపివేసి, తక్షణమే తర్వాతి ట్రిప్పులకు చేరుకోవాలి. మార్గమధ్యంలో ఖాళీ రైళ్ళు ఎక్కడా ఆలస్యం చేయకూడదు. ఆసుపత్రి రైళ్ళు కేంద్ర తరలింపు సంస్థ అనుమతితో మాత్రమే మరో మార్గం చేబట్టవచ్చు.

*-ప్రజామంత్రిమండలి ఛైర్మన్, లెనిన్*

# బాలల రక్షణ ప్రభుత్వ బాధ్యత

## సారటోవ్‌కి చెందిన సోవియట్ సంస్థలకు (1919)

రాష్ట్ర ఆహార కమిటీకి, రాష్ట్ర కార్యనిర్వాహక వర్గానికి, నగర కార్యనిర్వాహక వర్గానికి, యితర సంస్థలకు

సోవియట్ పాలన కిందనున్న రాజధానుల్లో[57] ఆకలిగొన్న బాలల రక్షణార్థం నెలకొల్పబడ్డ సారటోవ్ కౌన్సిల్‌కి సకల విధాలైన సహాయం అందజేయవలసిందని ప్రజా ఆహార మంత్రిత్వశాఖ చేసిన విజ్ఞప్తిని నేను పూర్తిగా బలపరుస్తున్నాను. నాకు సంబంధించినంతవరకు, మీరు ఆ కౌన్సిల్‌కి చేయగలిగిన సహాయమంతా చేయవలసిందని కోరుతున్నాను.

*- ప్రజామంత్రిమండలి మం. ఛైర్మన్, వి. ఉల్యానోవ్ (లెనిన్)*

# రోగగ్రస్త బాలలపై శ్రద్ధ

## క్రిమియా ఆహార మంత్రికి సరాసరి పంపిన నోట్ (1919)

## సింఫెరొపోవ్

గ్రేట్ రష్యాలో ఆహార పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నందున, బాలలకు - ముఖ్యంగా రోగగ్రస్తులైన బాలలకు - ఆహారం బొత్తిగా సరిపడ్డంలేనందున ఈ ఉత్తరువు జారీ చేయడమైంది. ప్రస్తుతం క్రిమియాలో లభించే డబ్బా పండ్లన్నిటినీ, వెన్న పదార్థాలన్నిటినీ గ్రేట్ రష్యా ఉత్తర ప్రాంతాలకు పంపాలి. వాటిని రోగగ్రస్తులైన బాలలకు మాత్రమే పౌష్టికాహారంగా యివ్వాలి. వారికి తప్ప మరెవ్వరికీ ఉపయోగించరాదు. అట్టి సప్లయిలను ఆహార మంత్రిత్వ శాఖ చిరునామాకు పంపాలి. దీనిమీద ఏ చర్యలు తీసుకున్నదీ త్వరగా తెలియజేయండి.

- రక్షణ సమితి ఛైర్మన్, లెనిన్
- ప్రజా ఆహారమంత్రి, స్యురుపా

57. లెనిన్ ప్రస్తావిస్తున్నది పెట్రోగ్రాడ్, మాస్కో నగరాలను గురించి.

# కమ్యూనిస్టుల నీతి ఏది?

## యువజన సమితుల కర్తవ్యాలు (1920)....

...మానవజాతి సృష్టించిన నిధులన్నిటి పరిజ్ఞానంతో మీ మనస్సుల్ని సుసంపన్న మొనర్చుకున్నప్పుడే, మీరు కమ్యూనిస్టులు కాగల్గుతారు...

కానీ, కమ్యూనిస్టు సచ్ఛీలత అంటూ ఏదైనా ఉందా? కమ్యూనిస్టు నీతి అంటూ ఏదైనా ఉందా? తప్పకుండా ఉంది. మనదని చెప్పుకొనే నీతి ఏదీలేదని కొందరు తరచు అంటూ ఉంటారు. కమ్యూనిస్టులు సకల నీతినీ తిరస్కరిస్తారనీ పెట్టుబడిదారీవర్గం తరచు నిందిస్తూ ఉంటుంది. ఇది, అసలు సమస్యను గందరగోళ పరచే మార్గం; కార్మిక కర్షకుల కళ్ళలో దుమ్ముకొట్టే పద్ధతి.

మనం నీతిని ఏ అర్థంలో తిరస్కరిస్తాం? ఏ అర్థంలో సచ్ఛీలతను తిరస్కరిస్తాం?

పెట్టుబడిదారీవర్గం చెప్పే అర్థంలో మనం నీతిని తిరస్కరిస్తాం. ఆ వర్గం, భగవదాదేశాలను నీతికి ఆధారంగా తీసుకొంది. దీనిపై మన అభిప్రాయం స్పష్టమే. భగవంతునిలో మనకు విశ్వాసం లేదనీ, మతాధిపతులు, భూస్వాములు, పెట్టుబడిదార్లు పీడకవర్గంగా తమ ప్రయోజనాలను పెంపొందించుకోడానికే భగవంతుని పేరు ఉచ్చరిస్తూ ఉంటారనీ మనం అంటాం. లేదా, వారు నీతిని నైతిక సూత్రాల మీద కాకుండా, భగవదాదేశాలమీద కాకుండా, భావవాద శబ్దాల మీద, లేక అర్థ భావవాద శబ్దాల మీద ఆధారపడేటట్లు చేస్తూ వుంటారంటాం. ఇవి యించుమించు భగవదాదేశాల్లాగే వుంటాయి.

మానవాతీత, వర్గాతీత భావనల మీద ఆధారపడే ఏ నీతినైనా సరే మనం తిరస్కరిస్తాం. అలాంటి నీతి మోసం అనీ, వంచన అనీ అంటాం; భూస్వాముల, పెట్టుబడిదార్ల ప్రయోజనాల రక్షణకై అది కార్మిక కర్షకుల్ని మందబుద్ధులుగా చేస్తుందంటాం.

మననీతి అలాకాక, శ్రామిక వర్గ పోరాట ప్రయోజనాలకు పూర్తిగా లోబడి ఉంటుందంటాం. శ్రామిక వర్గపోరాట ప్రయోజనాల నుంచి అది ఉత్పన్నమవుతుంది...

నేడు వర్గపోరాటం కొనసాగుతూనే వుంది. సకల ప్రయోజనాలు ఆ పోరాటానికి లోబడి యుండేటట్లు చూడ్డం మన కర్తవ్యం. మన కమ్యూనిస్టు నీతి కూడా దానికే లోబడియుండేటట్లు చూస్తాం. మనమిలా చెబుతాం. నీతి అంటే, పాత దోపిడీ సమాజాన్ని కూలదోయడానికి సహాయపడేది; కొత్త కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మిస్తున్న శ్రామికవర్గం చుట్టూ శ్రమజీవులందరినీ ఐక్యపరచేందుకు తోడ్పడేది.

కమ్యూనిస్టు నీతి అంటే అర్థం, యీ పోరాటానికి సహాయపడేది; శ్రమజీవుల్ని సకల దోపిడీకి వ్యతిరేకంగా ఐక్యపరచేది; స్వల్ప ఆస్తితో సహా, సకల విధాలయిన సొంత ఆస్తికి వ్యతిరేకంగా శ్రామిక ప్రజల్ని ఐక్యపరిచేది.

అయితే, నేనీ సమిష్టి ఆస్తిలో ఒక చెక్కనేల తీసుకొని, దానిమీద నా కవసరమైన దానికంటె రెట్టింపు ధాన్యం పండించి, ఆ అదనపు వుత్పత్తిమీద లాభం సంపాదించాననుకోండి. ఆకలిగొన్నవారెంత ఎక్కువ మంది ఉంటే అంత అధిక మూల్యం వారు చెల్లిస్తారని వాదించాననుకోండి. అప్పుడు నేను కమ్యూనిస్టులా ప్రవర్తిస్తున్నానా? లేదు; దోపిడిదారులాగ, యజమానిలాగ ప్రవర్తిస్తున్నాను. దీన్ని మనమెదుర్కోవాలి. అలా ఎదుర్కోకుండా ఊరుకుంటే, తిరిగి పెట్టుబడిదార్ల పాలన ఏర్పడుతుంది;

మనతో ఎవరైనా నీతిని గురించి మాట్లాడితే, వారికి మనమిలా చెబుతాం: కమ్యూనిస్టుల దృష్టిలో నీతి యావత్తూ ఈ ఐక్య క్రమశిక్షణలోనే ఉంది; దోపిడీదార్లకు వ్యతిరేకంగా మేము చైతన్యంతో జరిపే ప్రజా పోరాటంలోనే ఉంది; మాకు శాశ్వత నీతిలో విశ్వాసం లేదు; నీతిని గూర్చిన కాకమ్మకథల్లోని బూటకత్వాన్ని మేము బహిర్గతం చేస్తాం. మానవ సమాజం మరింత ఉన్నతస్థాయి నందుకోడానికీ, శ్రమదోపిడీ నుంచి అది విముక్తి చెందడానికీ తోడ్పడేదే నీతి.

**(అఖిల రష్యన్ యువ కమ్యూనిస్టు సమితి తృతీయ మహాసభలో యిచ్చిన ఉపన్యాసం నుంచి)**

# కమ్యూనిస్టు నీతిని గురించి

...లెనిన్ తిరిగి తన ఆలోచనల క్రమాన్ని యిలా అందుకున్నారు:

"ఔనవును. అదినాకు తెలుసు. అందుకోసమే నన్నుకూడా కొందరు వట్టి అనాగరికుణ్ణని అనుమానిస్తున్నారు[58] అయితే నేనందుకు ఆవేశపడను. బూర్జువా నాగరికతచే మలినమైన గుడ్లనుంచి అప్పుడే బయటికొచ్చిన పసిడి ముక్కుల పక్షి పిల్లలు విపరీతమైన తెలివితేటలతో ప్రవర్తిస్తున్నాయి. ఈ పరిస్థితితో మనం సరిపెట్టుకోవాలి, మన మార్గాన్ని మనం దిద్దుకోకుండా, లైంగిక సమస్య యొక్క ఆధునిక పరిశీలనా పద్ధతినీ, దానిపట్ల యువజనులు ప్రదర్శిస్తున్న అత్యాసక్తినీ చూస్తూంటే, యువజనోద్యమం కూడా యీ వ్యాధికి గురైనట్లు స్పష్టమవుతోంది."

లెనిన్ "ఆధునిక" అను శబ్దాన్ని వెటకారం, నిరసన మిళితమైయున్న ఒక సంజ్ఞతో నొక్కి పలికారు.

"యుద్ధం సమాప్తమై, విప్లవం ప్రారంభ దశలో ఉన్నప్పుడు, పాత సిద్ధాంత విలువలు పడిపోయి, తమ నిగ్రహశక్తిని కోల్పోతాయి. కొత్త విలువలు నెమ్మది నెమ్మదిగా, పోరాట క్రమంలో రూపుదిద్దుకొంటాయి. పురుషునికీ పురుషునికీ మధ్య, పురుషునికీ స్త్రీకి మధ్య సంబంధాలను గురించి వ్యాప్తిలోనున్న అభిప్రాయాలు విప్లవాత్మకంగా మార్పు చెందుతున్నాయి; భావస్పందనలు, ఆలోచనలు కూడా విప్లవాత్మకంగా మారుతున్నాయి. వ్యష్టి హక్కులకు, సమష్టి హక్కులకు మధ్య కొత్త హద్దులేర్పడుతున్నాయి; అందువల్ల, వ్యష్టి విధుల మధ్య కూడా కొత్త హద్దులేర్పడుతున్నాయి; దీన్నిబట్టి, పాతవాటి నిష్క్రమణ, కొత్తవాటి ప్రవేశం నెమ్మదిగా, తరచు బాధాకరంగా జరుగుతాయని స్పష్టమవుతుంది. ఇదే, లైంగిక సంబంధాలకు కూడా వర్తిస్తుంది;

58. అతి గడ్డు విప్లవ పోరాట రోజుల్లో కొందరు సోషల్ డెమోక్రాట్లు ప్రేమకు, వివాహానికి సంబంధించిన సమస్యలను ముందుకు తెచ్చినప్పుడు లెనిన్ వారిని తీవ్రంగా విమర్శించారు. అందుకాయనను వట్టి అనాగరికుడన్నారు.

వివాహానికీ, కుటుంబానికీ కూడా వర్తిస్తుంది. బూర్జువా వివాహం యొక్క విచ్ఛిత్తి కష్టభరితమై, భర్తకు స్వేచ్ఛ భార్యకు దాస్యం ప్రసాదించి, లైంగిక నీతినీ వైవాహిక సంబంధాల్నీ కంపరమెత్తిస్తూంది. బూటకమైన వాటిగా చేస్తూంది. అందువల్ల, మానవజాతి ఉత్తమ ప్రతినిధులంతా బూర్జువా వివాహాన్ని అసహ్యించుకొంటున్నారు. అది యీ రోజున పతనమవుతూ, కుళ్ళి కంపు కొడుతోంది....

..."వివాహం, లైంగిక సంబంధాల రంగాల్లో నేడొక విప్లవం ఆసన్నమవుతోంది. అది శ్రామిక విప్లవాని కనుగుణమైనట్టిది. అతి జటిలమైన, మిశ్రమ స్వభావం గలిగిన సమస్యలెన్నో ముందుకొస్తాయి. అది సహజంగా స్త్రీలనూ, యువజనుల్నీ తలమునక లొనర్చుతాయి. అస్తవ్యస్తమైయున్న యీ లైంగిక సంబంధాలు స్త్రీలనూ, యువజనుల్నీ కూడా చాలా వేధిస్తాయి. యువజనులు, వారి సహజ లక్షణమైన ఉద్రిక్తతతో యీ సమస్య నెదుర్కొంటారు. దీన్ని మనం అర్థం చేసుకోగలం. యువజనులకు మత వైరాగ్యాన్నీ, తుచ్ఛమైన బూర్జువా నీతి విశిష్టతనూ బోధించడమంత తప్పు మరొకటి ఉండదు. అయితే, యిటీవలి సంవత్సరాల్లో, కొన్ని సహజ కారణాలవల్ల, దడాలున వెలుగులోకి తోయబడ్డ లైంగిక సంబంధాలు యువజనుల మనస్తత్వంలో ఒక ప్రధానాంశమవడం మంచి లక్షణమని ఎవరూ అనరు. దాని ఫలితాలొక్కొక్కప్పుడు వినాశకరంగా పరిణమిస్తాయి. దీన్ని గురించి కామ్రేడ్ లిలినాను అడిగి చూడండి. ఆమె వేర్వేరు విద్యాసంస్థల్లో విస్తృతంగా పనిచేసి యుండడంవల్ల కొంత అనుభవం సంపాదించి యుంటారు. ఆమె నిజమైన కమ్యూనిస్టు అని, దురభిమానాలు లేని కమ్యూనిస్టు అని మీరెరుగుదురు.

"లైంగిక జీవితానికి సంబంధించిన సమస్యలపట్ల యువజనుల వైఖరిలో వచ్చిన మార్పుకు ఒక "సూత్రబద్ధమైన" సిద్ధాంత ఆధారం ఉన్నదనేది స్పష్టమే. తమది "విప్లవ" దృక్పథమనీ, "కమ్యూనిస్టు" దృక్పథమనీ చాలా మంది చెప్పుకొంటున్నారు. దీన్ని వారు త్రికరణ శుద్ధిగా నమ్ముతున్నారు కాని వృద్ధుడనైన నేను దానివల్ల ప్రభావితుణ్ణి కాలేదు. నేను చింతాక్రాంతుడనైన విరాగిని కాకపోయినా, యువజనుల్లో, తరచు పెద్దవాళ్ళలోకూడా, కనిపించే యీ "నూతన లైంగిక జీవనం"

పూర్తిగా బూర్జువా లక్షణంగా నాకు కనబడతోంది. ఇదివరకటి బూర్జువా వ్యభిచారగృహానికి ప్రతిరూపంగానే నాకిది తోస్తోంది. కమ్యూనిస్టులం దేన్నైతే స్వేచ్ఛా ప్రణయంగా అర్థం చేసుకుంటామో, దానితో దీనికి రవ్వంతైనా పోలిక లేదు. కమ్యూనిస్టు సమాజంలో కామవాంఛను తీర్చుకోడం, ప్రేమను వాంఛించడం మంచి నీళ్ళ గ్లాసుతో నీళ్ళు తాగడమంత సులభమైన, అల్పమైన విషయమనే ప్రసిద్ధ సిద్ధాంతాన్ని గురించి మీరు వినే వుంటారు. ఈ 'మంచినీళ్ళ గ్లాసు' సిద్ధాంతం పై మన యువతరం పిచ్చెత్తి పోయింది; పూర్తిగా పిచ్చెత్తి పోయింది. ఇది అనేకమంది యువతీ యువకుల్ని నాశనం చేసింది. ఇది మార్క్సిస్టు సిద్ధాంతమని దీని ఆరాధకులు గట్టిగా చెబుతారు. ప్రపంచంలో జరిగే సమస్త పరిణామాలు సమాజంయొక్క భావశాస్త్ర (ideological) ఉపరితలంలో వచ్చే సమస్త మార్పులు, ఒకే ఒక మూలం – ఆర్థిక పునాది – నుంచి ప్రత్యక్షంగాను, సూటిగాను, అనివార్యంగాను రూపొందుతాయని చెప్పే 'మార్క్సిజానికి' నా సలాం. ఇది పైకి కనబడేటంత సులభమైన విషయం కాదు. చాలా కాలం కిందటే ఎంగెల్స్ అను ఒకానొక వ్యక్తి యీ వాస్తవాన్ని నిరూపించియున్నాడు. ఇది చారిత్రక భౌతిక వాదానికి సంబంధించినట్టిది.

"ఖ్యాతి గాంచిన యీ 'మంచినీళ్ళ గ్లాసు' సిద్ధాంతాన్ని మార్క్సిస్టు సిద్ధాంతంగా నేను పరిగణించను. పైగా యిది సంఘ వ్యతిరేక సిద్ధాంతమని నా అభిప్రాయం. లైంగిక జీవితంలో ప్రత్యక్షమయేది ప్రకృతి ప్రసాదించింది మాత్రమే కాదు; సంస్కృతి నుంచి (అది ఉన్నతమైనదయినా కావచ్చు, హీనమైనదయినా కావచ్చు) ఉత్పన్నమయే ఒక మిశ్రమం నుంచి అది రూపొందుతుంది. సామాన్యమైన కామవాంఛ వ్యక్తుల్లో లైంగిక ప్రేమగా వృద్ధిచెంది నిర్మలమవడం ఎంత ప్రాముఖ్యత గల విషయమో ఎంగెల్స్ తన 'కుటుంబం యొక్క పుట్టుక' అను గ్రంథంలో తెలియజేశారు. స్త్రీ పురుష సంబంధాలు సామాజిక అర్థశాస్త్రానికీ, శారీరక వాంఛకూ మధ్య జరిగే ఆట కాదు. స్త్రీ పురుష సంబంధాల్లో వచ్చే మార్పుల్ని మొత్తం భావశాస్త్రం (ideology) తో వాటికి గల సంబంధాల నుంచి వేరుపరచి, సమాజపు ఆర్థిక పునాది నుంచి అవి సరాసరి ఉత్పన్నమయేవిగా అర్థం చేసుకోవడం మార్క్సిజం కాదు;

హేతువాదం మాత్రమే అవుతుంది. నిజమే, మనం దాహాన్ని తీర్చుకోవలసిందే. కాని, ఒక సామాన్య వ్యక్తి సామాన్య పరిస్థితుల్లో ఒక మురికి కాలవలో పడుకొని మురికి నీళ్ళు తాగుతాడా? కొన్ని డజన్ల పెదవులు తాకిన గ్లాసు అంచు నుంచి అయినా మనం మంచినీళ్ళు తాగుతామా? కాని, అత్యంత ప్రధానమైన విషయం సామాజిక సంబంధమైనట్టిది. నిజం చెప్పాలంటే, మంచినీళ్లు తాగడం వ్యక్తిగతమైన విషయం. కాని, ప్రేమించడంలో యిద్దరు వ్యక్తులు భాగస్వాములవడమే కాక, మూడవ వ్యక్తి – కొత్తప్రాణి – యొక్క పుట్టుకకు కారకులవుతారు. ఇదే సామాజిక ప్రయోజనమంటే. దీన్నుంచే ఉత్పన్నమవుతుంది, సమాజం పట్ల మన కర్తవ్యం.

"ఈ 'మంచినీళ్ళగ్లాసు' సిద్ధాంతం ఒక సొగసైన లేబుల్‌తో, 'విముక్త ప్రేమ' అను లేబుల్‌తో అతికించబడి యున్నప్పటికీ, నేను కమ్యూనిస్టుగా దాన్ని మెచ్చుకోను. అంతేకాక, ఇది కొత్త సిద్ధాంతమూ కాదు, కమ్యూనిస్టు సిద్ధాంతమూ కాదు. ఇది గత శతాబ్దం మధ్య రమ్యమైన కావ్యాల్లో 'హృదయ విమోచన' అనే పేరుతో, వ్యాప్తి చేయబడిందనే విషయం మీకు గుర్తు ఉండి యుంటుంది. కాని, బూర్జువా సమాజ పరిస్థితుల్లో యీ సిద్ధాంతం శరీర విమోచనగా తయారైంది. అప్పుడిది యిప్పటికన్నా ఎక్కువ నిపుణతతో బోధింపబడింది. ఇప్పుడిది ఆచరణలో ఎలా వుందో నిర్ధారణగా నేను చెప్పలేను.

"నా విమర్శ వైరాగ్యానికి దారితీయాలని నా ఉద్దేశం కాదు. అది నాకు స్ఫురించనే లేదు. కమ్యూనిజాన్ని అనుసరించి రావలసింది వైరాగ్యం కాదు; జీవిత మాధుర్యమూ, నిత్యానందమూను. ఇవి ప్రేమతో నిండిన జీవితం నుంచి ఉద్భవిస్తాయి. కాని, యీనాడు మన యెదుట పొంగి పొరలే లైంగిక జీవితం ఆనందాన్ని గాని, సంతోషాన్ని గాని ఈయదని నా అభిప్రాయం; పైగా వాటినది కుంచిస్తుంది. ఇది విప్లవ తరుణంలో మంచిది కాదు; చాలా చెడ్డది.

"యువజనులకు జీవితానందం, సంతోషం ఎంతో అవసరం. ఆరోగ్యవంతమైన క్రీడలు – కసరత్తు, ఈత, వినోదయాత్రలు, అన్నిరకాల వ్యాయామం – అవసరం. రకరకాలైన మనోవ్యాపారాలు

కూడా - బోధన, విమర్శ, పరిశోధన - వారికుండాలి. వీటిని సాధ్యమైనంతవరకు ఒకదానితో ఒకటి మేళవించాలి. యువజనులకు లైంగిక సమస్యలమీద నిరంతరం యిచ్చే ఉపన్యాసాలకన్న, 'జీవిత వినిమయం' అనుదానికన్న యెక్కువ ఉపయోగకరం. ఆరోగ్యకరమైన శరీరంలో ఆరోగ్యకరమైన మనసు - యిదీ కావలసింది. కాబట్టి, సన్యాసిగానూ ఉండొద్దు, డాన్ జాన్[59] గానూ ఉండొద్దు. మధ్యేమార్గ మవలంబించే జర్మన్ ఫిలిస్టైన్‌గా కూడ ఉండొద్దు. ఇంతకూ, మీ కామ్రేడ్-ని ఎరుగుదురు కదా. అతడు అందమైనవాడు. శక్తివంతుడూను. కాని, ఎన్ని ఉన్నా ప్రయోజనం శూన్యమని నా అనుమానం. అతని ప్రేమ వ్యవహారాలు ఒకటి తర్వాత ఒకటి సాగిపోతూనే ఉంటాయి. దానివల్ల రాజకీయ పోరాటానికి గాని, విప్లవానికిగాని మంచి జరగదు. తమ జల్సాజీవితాన్ని రాజకీయాలతో జతపరచే స్త్రీలూ, కనపడ్డ ప్రతి లంగానూ వెంబడిస్తూ - ప్రతి యువతి గుడ్డపీలికనూ వాంఛించే పురుషులూ నమ్మదగినవారని గాని, దృఢసంకల్పులని గాని నేననుకోను. వద్దు, వద్దు; విప్లవానికిది ఏ విధంగానూ సరిపడదు."

ఈ మాటలంటూనే, లెనిన్ తన చేత్తో టేబుల్ గుద్ది, తటాలున గంతువేసి నిలబడ్డారు; గదిలో యిటునుంచి అటు కొన్ని అడుగులు నడిచారు. మళ్ళీ యిలా అందుకున్నారు:

"విప్లవం ప్రజానీకం నుంచి, వ్యక్తుల నుంచీ ఏకాగ్రతను కోరుతుంది; నరనరం పనిచేయాలని కోరుతుంది. అన్నుంజియో[60] సృష్టించిన నాయకీ నాయకుల ఉన్మత్త తాండవాలను అదెన్నటికీ సహించదు. లైంగిక విషయాల్లో విశృంఖలత్వం బూర్జువా లక్షణం; అది పతనానికి చిహ్నం. కాని, శ్రామికవర్గం పైకి, పైపైకి ఎక్కేవర్గం. దానికి, మైమరపించేదేదీ, ఉద్రిక్త పరచేదేదీ అక్కర్లేదు. లైంగిక విశృంఖలత్వం ద్వారాగాని, మద్యపానం ద్వారాగాని అది తన్ను తాను ఉద్రిక్తపరచుకో నక్కర్లేదు. పెట్టుబడిదారీ విధానంలోని నైచ్యాన్నీ, కల్మషాన్నీ, క్రౌర్యాన్నీ

---

59. డాన్ జాన్ - స్పెయిన్ దేశపు పురాణగాథల్లో ఒక సామంత ప్రభువు, జారశిఖామణి.

60. గేబ్రియల్ డీ అన్నుంజియో (1863-1938) అభివృద్ధి నిరోధక ఇటాలియన్ రచయిత; సిద్ధాంతపరంగా ఫాసిజంను సమర్థించినవాడు.

అది మరువజాలదు; మరువ నిచ్చగించదు. సమాజంలో తాను ఆక్రమించే స్థానం నుంచి, కమ్యూనిస్టు ఆశయంనుంచి అది అత్యధిక ఉద్రిక్తతను పొందుతుంది. దానికి కావలసింది స్పష్టత. స్పష్టత, మరోసారి స్పష్టత. అందుచేత, నేను యింకోసారి చెప్పేదేమంటే, బలహీనత ఎంతమాత్రం పనికిరాదు; శక్తి సామర్థ్యాలను వ్యర్థపరచరాదు; వాటిని నాశనం చేసుకోరాదు. స్వయం శక్తీ, స్వయం శిక్షణ బానిసత్వం కావు; ప్రేమలోకూడ ఇవి అవసరమే...

*- వి.ఐ. లెనిన్ (1920)*

*(క్లారాజెట్కిన్[61] రచించిన "లెనిన్ స్మృతులు" అను గ్రంథం నుంచి)*

# భార్యాభర్తల హోదాలు

..."స్త్రీలు చేసే యింటిపనుల్లో తోడ్పడ్డంవల్ల తమ భార్యల బరువుల్నీ, చికాకుల్నీ ఎంతగానో తగ్గించవచ్చుననీ, పూర్తిగా తొలగించవచ్చుననీ భావించే భర్తలు, శ్రామిక బృందాల్లో సైతం అట్టే మంది లేరు. అలా చేయడం 'భర్త హక్కులకు, హోదాకు' భంగకర మనుకొంటున్నారు, వారు. భర్త, తనకు విశ్రాంతీ, సౌకర్యాలూ ఉండాలని డిమాండు చేస్తున్నాడు. కాని, స్త్రీ అనుదినం వేలాది అతి స్వల్ప విషయాల్లో త్యాగాలు చేస్తూంది. ఇదే ఆమె గృహజీవితం. పూర్వంనుంచీ ఆమె భర్త ఆమె ప్రభువు, ఆమె యజమాని చెలాయిస్తున్న హక్కులన్నీ ఆమెమీద కనబడని రూపంలో అధికారం చేస్తున్నాయి. అలాగే, బానిస స్థితిలోనున్న అతని భార్య, కనబడని రూపంలోనే, తన భర్తమీద బాహ్యాత్మకంగా (Objectively) ప్రతీకారం తీర్చుకొంటూంది. స్త్రీ వెనుకబాటు స్థితీ, తన భర్త విప్లవ ఆశయాలపట్ల జ్ఞాన రాహిత్యం అతని

61. క్లారాజెట్కిన్ (1857–1932) జర్మన్ కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖ వ్యక్తి; మొదటి ప్రపంచ యుద్ధకాలంలో రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థలోని అవకాశవాదాన్ని తీవ్రంగా ఎదుర్కొన్నారు; అక్టోబరు విప్లవంలోను, అంతర్యుద్ధంలోను, సోవియట్ యూనియన్‌ని బలపరచారు. జర్మన్ రీచ్‌స్టాగ్ (పార్లమెంటు)లో అందరికంటే సీనియర్ మెంబరు.

ఉత్సాహాన్నీ, పోరాట దీక్షనూ వెనక్కు లాగుతున్నాయి. ఇవి పైకి కనబడకుండా, నెమ్మదిగాను, ఖచ్చితంగాను లోపలనుంచి తినివేసే, పీల్చి పిప్పిచేసే సూక్ష్మక్రిములు..."

# కమ్యూనిస్టుల ఆరోగ్యం గురించి

కామ్రేడ్ గొర్బునోవ్‌కి ఒక ప్రతి
కామ్రేడ్ మిరోష్నికోవ్‌కి ఒక ప్రతి

సెప్టెంబరు 20, 21, 22 నుంచి లిఫ్టు పని చేయదని నాకు తెలియజేశారు.

ఇది అత్యంత ఘోరమైన విషయం. గుండె జబ్బుతో బాధపడేవారు మెట్లెక్కి రావడం హానికరమే కాక, ప్రమాదకరం కూడా. లిఫ్టు ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంచబడాలనీ, యిందుకు ఎవరో ఒకరు బాధ్యత వహించవలసి యుంటుందనీ నేను వెయ్యిసార్లు స్పష్టం చేశాను.

నేను మిమ్మల్ని కఠినంగా మందలిస్తున్నాను; తగినంత నోటీసు యివ్వకుండా ఎవరెవరు యీ పని చేశారో నిర్ధారణ చేయవలసిందని మిమ్మల్ని ఆదేశిస్తున్నాను: వారి పేర్ల జాబితాను, వారికి విధింపబడిన శిక్షలను మరోసారి నాకు పంపండి.

*- ప్ర. మం. ఛైర్మన్, వి. ఉల్యానోవ్ (లెనిన్)*
*ఐ.ఐ. మిరోష్నికోవ్[62] కి జాబు (సెప్టెం. 19, 1921)*

62. ఐ. ఐ. మిరోష్నికోవ్ ప్రజామంత్రిమండలి ఛైర్మన్ కార్యాలయంలో అసిస్టెంట్ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు.

# పాత పార్టీ కార్యకర్తల ఆరోగ్యంపై శ్రద్ధ

దయచేసి మొదటి సోవియట్ గృహంలో ఒక గదిని వెంటనే కామ్రేడ్ సెసేవియా సమోయ్‌లోవ్నా బొబ్రోవ్‌స్కయాకు యిచ్చివేసేటట్లు చూడండి. నేనామెను ఒక పాత పార్టీ వర్కరుగా బాగా ఎరుగుదును. ప్రస్తుతం ఆమె అతి దుర్భరమైన పరిస్థితుల్లో జీవిస్తున్నారు. ఆమెను వెంటనే ఒక సోవియట్ గృహానికి పంపమని డాక్టర్లు ఆదేశించారు.

ఈ పని ఎప్పుడు జరిగిందీ సెక్రటేరియటుకు తెలియజేయండి.

- *ప్ర. మం.మం. ఛైర్మన్, వి. ఉల్యానోవ్ (లెనిన్)*

తాజాకలం: నేను బొబ్రోవ్‌స్కయాను 1905 కి పూర్వం నుంచీ ఎరుగుదును. ఆమె ఎంత కాలమైనా మౌనంగా బాధపడగలరు. అందుచేత, ఆమెను త్వరగా ఆదుకోవాలి.

ఏ.ఆర్. కేంద్ర కార్య నిర్వాహక వర్గ గృహ నిర్వాహకునికి (1921)

# కమ్యూనిస్టుకు ప్రధానశత్రువులు

**- ముగ్గురు -**

నేడు ఎవరు ఏ శాఖలో తమ విధులు నిర్వర్తిస్తున్నా, వారిని ముగ్గురు శత్రువు లెదుర్కొంటున్నారని నా అభిప్రాయం. ఆ విధులు ప్రతి రాజకీయ విద్యావేత్తా-కమ్యూనిస్టు అయితే-నిర్వర్తించవలసినవి. ప్రస్తుతం రాజకీయ విద్యావేత్తలందరూ కమ్యూనిస్టులే కదా. వారి నెదుర్కొంటున్న

ప్రధాన శత్రువులు ప్రథమంగా కమ్యూనిస్టు అహంకారం, తర్వాత నిరక్షరాస్యత; ఆ తర్వాత లంచగొండితనం...

*"నూతన ఆర్థిక విధానం, రాజకీయ విద్యా - విషయిక శాఖల[63] కర్తవ్యాలు" అనే రిపోర్టునుంచి (1921)*

# నైతిక పాటవం ఆటుపోటులు

...నైతిక పాటవమంటే అర్థం, నిస్పృహకూ, అస్తవ్యస్తతకూ లోనుకాకుండా తన్ను తాను కాపాడుకోవడం, పరిస్థితిని ప్రశాంతచిత్తంతో పరిశీలించడం, ఉత్సాహాన్నీ, దృఢదీక్షనూ నిలబెట్టుకోవడం, ఒకవేళ చాలా వెనక్కు తిరోగమించ వలసివస్తే మరీ ఎక్కువ దూరం పోకుండడం, సరియైన సమయంలో తిరోగమనానికి స్వస్తిచెప్పి ఎదురుదాడికి ఉపక్రమించగల్గడమూను...

*"నేడూ, సోషలిజం పూర్తిగా విజయం సాధించాక బంగారం యొక్క ప్రాముఖ్యత" అనే వ్యాసం నుండి (1921)*

# తప్పుల్ని అంగీకరించాలి

...కొందరు కమ్యూనిస్టులు, పొరబాట్లు చేయకుండా, తిరోగమనం చేయకుండా, అసంపూర్ణమైన అపసవ్యమైన వాటిని అనేక

63. రాజకీయ-విద్యా విషయిక శాఖలు = సోవియట్ ప్రభుత్వ ప్రారంభ సంవత్సరాల్లో రాజకీయ, విద్యా విషయిక కార్యాలను నిర్వహించేందు కేర్పరచబడ్డ సంస్థలివి. 1919లో చాలా రాష్ట్రాలలో, ప్రభుత్వ విద్యాలయాలకు అనుబంధ సంస్థలుగా ఎన్నో రాజకీయ, విద్యా విషయిక శాఖ లేర్పరచబడ్డాయి. 1910లో ప్రజా మంత్రిమండలి కింద ఒక రాజకీయ విద్యాశాఖ స్థాపింపబడింది. అది, వయోజనులకు బోధించే ప్రజా కమ్యూనిస్టు విద్యకు సారథ్యం వహించేది (నిరక్షరాస్యత నిర్మూలన, వయోజన పాఠశాలలు, క్లబ్బులు, గ్రంథాలయాలు, రీడింగు రూములు); పార్టీ ఎడ్యుకేషన్‌ను కూడ అదే నడిపేది (కమ్యూనిస్టు కళాశాలలు, సోవియట్ పార్టీ స్కూళ్ళు). 1930లో యిది విద్యా మంత్రిత్వశాఖ కింద ప్రజల్లో పనిచేసే రంగంగా పునర్నిర్మింపబడింది.

విధాల మార్పుచేయకుండా సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు పునాదులు నిర్మించే కర్తవ్యాన్ని పూర్తి చేయడమనే చరిత్రాత్మక కర్తవ్యాన్ని తుదకంటా నిర్వర్తించగలమని (ముఖ్యంగా, చిన్నరైతు లధికంగా వున్న దేశంలో) భావిస్తారు. అలాంటి కమ్యూనిస్టులు పతనమై తీరుతారు. మరికొందరు కమ్యూనిస్టులున్నారు; వారు భ్రమలకు లోనుకారు, నిస్పృహకు దాసులవరు; అతి కష్టమైన పనులు చేసేటప్పుడు "ప్రారంభం నుంచీ ప్రారంభించి," చేసిందే చేయగల శక్తినీ, పట్టు విడుపుల్నీ కాపాడు కుంటారు. అట్టి కమ్యూనిస్టులు పతనమవరు (ముప్పాతిక వంతులు నశించరు)...

...మన తప్పుల్ని మనం అంగీకరించడానికి భయపడకుండా ఉంటే, వాటిని దిద్దుకోడానికి పదేపదే ప్రయత్నించడానికి వెరవకపోతే- శిఖరాగ్రం చేరుకుంటాం...

*"పబ్లిసిస్టు వ్యాఖ్యలు" అనే రచన నుంచి (1922)*

